శైవపరిచారిణీ గ్రంథమాల. ౨౫

సంపాదకులు.

కాడిమేల రాజలింగారాధ్యులు.

శ్రీస్కాంద మహాపురాణంబున - శంకరసంహిత యందలి

శివరహస్యఖండంబునందు

# యుద్ధకాండము.









గ్రంథకర్త.

కోడూరి వేంకటాచల కవి.

## రాజపోషకులు.

బ్రి॥ శ్రీ॥ రా॥ శ్రీ ఇజ్జతాసార్ రాజా కందుకూరి బాలసూర్య ప్రసాదరావు జమీందారు గారు. విశాఖ పట్టణము.

## శాశ్వతాభిమానులు.

బ్రి॥ శ్రీ॥ కావర్సు రాజయ్యగారి కొమారుడు వీరరాజు గారు. దుబ్బ.
మ॥ రా॥ కొమరపల్లి కాశయ్యగారు. వరంగల్.
శ్రీ॥ శ్రీ॥ భూపతి రత్నం గారు. వరంగల్.
మ॥ రా॥ భూపతి రామన్న గారు. వరంగల్.
మ॥ రా॥ నాగబండి కట్టమల్లయ్య గారు. వరంగల్.
మ॥ రా॥ కొండూరి వెంకట రాజం బ్రదర్సుగారు. వరంగల్.
మ॥ రా॥ అప్పని రామయ్య గారు. వరంగల్.

## శాశ్వతచందాదారులు.

...రాధ్యుల మల్లయ్య అయ్యవార్లంగారు. వ..బైవాడ.
...సూంబగారి మల్లయ్యఅయ్యవార్లంగారు. వరంగల్.
...బాలకోటి లింగం గారు - ము.న్సబ్ హెడ్ క్లర్కు-
సబ్ కోర్టు సెంట్రిల నాజర్ బాపట్ల.
...గా రాధ్యులవారు. వరంగల్.
...రాయణ సింగుగారు. వరంగల్.
... మజ్జిముచ్చాల.
...రు. సిద్ధిపేట.
...ంగారి అంతయ్యగారు. సిద్ధిపేట.
...య్య గారు. ముల్కనూరు.
...గారు. చెన్నంపల్లి.
...రు. చెన్నంపల్లి.
...గారు. వరంగల్.

# పీఠిక.

మహాజనులారా!

ఈ యుద్ధకాండము శివరహస్య ఖండంబు నందలి నాల్గవ భాగము. దీనిని రచించిన కవీంద్రుండు కోడూరి వెంకటాచల కవి. ఇతని జీవిత చరిత్ర ముపలబ్ధమైనంత వరకు నుపదేశ కాండమునం బ్రకటింపం బడినది.

ఈతని నివాసగ్రామమును గూర్చి యిందు చర్చించుమని వ్రాసినను- తగిన పరికరములు సమగ్రముగ లభింపమిచే బ్రస్తుతమావిషయమునుండి విరమించుచున్నారము.

ఈ యుద్ధకాండమున-సింహవక్త్ర- శూరపద్మాసురుల సంహారము-వర్ణింపఁబడినది. ఈసంగ్రామము రామరావణయుద్ధముకన్నను-భారతయుద్ధముకన్నను- నెన్నియోవిధముల విచిత్రముగ నున్నది.

రాక్షసవీరాగ్రగణ్యులయి బ్రహ్మాండముల నేలి దివిజబృందము నంతయు నాపోశనముఁబట్టిన శూరపద్మ సింహవక్త్ర తారకాసురుల పూర్వవృత్తాంతము పాఠకలోకమున కాకింపవినిపించుట ప్రధానముగాక పోదు.

## శూరపద్మాదుల పూర్వవృత్తాంతము.

పూర్వమున నొక కల్పమునందు శాకద్వీపమున ధరిత్రినేలుచున్న రాజచూడామణి ప్రభాకరుఁడను వాఁడొకఁడుండెను. అతనిసతీలలామ నామధేయము సుకుమారి. ఆసుకుమారీ ప్రభాకరులకు నలువురు పుత్రులు జన్మించిరి.

ప్రభాకరుఁడు తజ్జననీజనకులయిన పద్మాసురులనామంబులం బ్రథమద్వితీయపుత్త్రులకును-తనపిత్రువ్యుఁడైనసింహవక్త్రునామంబుతృతీయపుత్రునకును, తనసోదరుఁడయిన తారకుని నామంబు చతుర్థపుత్రునకు నిడియె.

ప్రభాకరుఁడు కొంత కాలము సుకుమారియగు సుకుమారితోఁగూడ రాజ్యమేలి తన కుమారరత్నంబులయిన శూరపద్మ సింహవక్త్ర తారకులకు రాజ్యభారం బప్పగించి తపంబుఁజేయుటకై ధర్మపత్నితో నడవి కేగెను.శూరపద్మాది రాజచంద్రులు మహాధర్మాత్ములై రాజ్యంబు పరిపాలింపఁదొడంగిరి.

ఇటులుండ నొకదినంబున నగస్త్యమహర్షి యరుదెంచ శూరపద్ము లిరువురును నామునిసార్వభౌముని నర్ఘ్యపాద్యాది విధులచేఁ బూజించిరి. అంతనాకుంభసంభవుఁడు వారిరువురియందు కరుణగలవాఁడై కుమారస్వామిమాహాత్మ్యంబు నుపదేశించి చనెను.

అది మొదలు శూరపద్మ లిరువురు కుమారస్వామిని మహాభక్తితో బూజించుచుండిరి. పూజించుటయేగాక, యాతని వాహనమగు మయూర రూపమును శూరభూపాలుఁడును యాతని కేతనమగు కుక్కుటరూపమును పద్మభూపాలుఁడును బొంది యామహాత్ముని సేవింప దలంచు చుండిరి.

ఇటులనే సింహవక్త్రధరణీంద్రుని దగ్గరకు తృణబిందుఁడను మునీంద్రుఁడు వచ్చి లోకమాతయగు దుర్గాదేవిమహిమ నుపదేశించెను. అది మొదలు సింహవక్త్రమహీపాలుఁడు మహాభక్తితో దుర్గను బూజించుచు నాలోకజనని వాహనమగు సింహరూపమును బొంది యామహాకాళీ ప్రేమపాత్రుఁడుగా వలయునని తలంచుచుండెను.

ఇదే విధముగ వేరొకప్పుడు ఋషభయోగియను యోగీంద్రుఁడు తారకక్షితిపతి చెంతకేతెంచి శాస్త్ర (భైరవ) మాహాత్మ్యంబుపదేశింప తారకక్షితిపతికి భైరవునియందుభక్తిగలిగియామహాత్ముని పూజించుచు నాతనివాహనమగు గజాకారమునుబూని యాతని కృపాలోకన పాత్రుఁడుగాఁ దలంచుచుండెను.

ఈవిధముగ శూరపద్మ సింహవక్త్రతారక రాజేంద్రులకు వారివారి దేవతా వాహన రూపములఁ ధరింపఁ గోరికగలుఁగ, వారునలువురు తమతమరాజ్య భారంబును సుతులకు నప్పగించి తపోవనంబున కరిగి నలుఁబదినాలుగువేల సంవత్సరములు ఘోరతపంబు నాచరించిరి.

అట్టియెడ నొకదినంబునఁ గైలాస పర్వతమునకు శంకరుని సేవించుటకై విష్ణుబ్రహ్మాది దేవతలందరు వెళ్ళి తమ వాహనంబులఁ గ్రిందనిడి యీశ్వరసేవకుఁ జనిరి. క్రిందనున్న దేవతావాహనంబులలో గరుత్మంతుఁడు హంస మొదలగునవి కుమారస్వామి వాహన కేతనములైన మయూర కుక్కుటములను దుర్గాశాస్త్రి వాహనములైన సింహగజములనుజూచి "మీరేల సంతసించెదరు. మీపదంబులు పొంద ప్రభాకర పుత్రులు పంచాగ్ని మధ్యతపంబాచరించు చున్నవారనివచింప, నవిశూరాదులకడకుఁగ్రోధంబుతోఁజనియగ్నులు చల్లార్చి వారిమనోరథంబుల దెలిసికొని, "మీరుమాపదంబుల గోరితిరిగనుక మాముఖములుగల భూతము లగుదురు గాక" యనివారికిశాపంబిడెను.

అంతశూరాది రాజేంద్రులుమయూరకుక్కుటసింహగజముఖంబులుగ

ల భూతములై తొల్లి మయూరాదుల చెంతకు వచ్చి వేడికొన, నవి కరుణించి "కొంతకాలం బిచ్చట మీ రిట్టుల నేయుండుడు. అనంతరము మీ మనోరథంబు లీడేరు" నని పచింప, వారు బ్రహ్మాండావరణ భూతంబులతోఁ దిరుగుచు నచ్చట నుండిరి.

కొంతకాలము జరిగిన పిదప, రాక్షసులచే బాధింపఁ బడి దేవతలు, సర్వభూతాలయం బగు రజతాచలంబున కేగి భూతంబుల వేడికొన, వానిలో భూతంబుల యిన ప్రభాకరతనయులు కొన్ని భూతంబుల సహాయము గైకొని రాక్షసులఁ బీచ వడంచి దేవతల కుపకారము చేసెను.

అదిగని రాక్షసరాజు, భూతగణాధీశుని చెంత కరుదెంచి మొరఁ బెట్టిన, యాతఁడు, ఆవాల్గు భూతంబులఁ బిలచి "మదాజ్ఞ లేక మీరు మెలంగితిరి గనుక యిదిమొదలు మీరు రాక్షసభావంబు నొంది దేవతలకపకార మొనర్చుచు నుండెదరు గాత" మని శాపం బిడియె.

ఆ కారణంబున, స్కందుని మయూర కుక్కుటముల గూడుకొని యా వాల్గు భూతంబులు వేరొకవ్వుడు కైలాసంబున నీశ్వరునృత్త విలాసముఁ జూడ నరుదెంచిన దేవతల వాహనంబుల నశింపఁ జేసియు, వారిపురంబుల గాల్చియు, వారిజ లంబుల బాధించియు వచ్చి పూర్వము రీతి భూతగణంబులోఁ జేరియుండెను.

తరువాతఁ గిరిం దికి డగి వచ్చిన దేవతలందఱు కుమారస్వామికా వృత్తాంతమంతయుఁ జెప్ప నా మహాత్ముండు భూతంబులఁ బిలిచి "మీరు కలుష బుద్ధులై యుంటిరి గాన దానవులై జన్మింతురు గాత" మని శపించె.

అంత శూరపద్మ భూతంబులు "దేవా! నీకొరకై యనేక వేల వత్సరంబులు తపంబు చేసిన మమ్ముటుల నీవిరోధిగ నుండ శపింప దగునే?" యని పలువిధములనుతింప కుమారస్వామి చిరునవ్వు నవ్వుచు- "మీరిరువురు గలసి యొక రూపంబున నే పుట్టి శూరపద్మ నామంబున వెలసి నాచేతఁ జంపబడి యనంతరము నా వాహన కేతన రూపంబుల నొందెదరు గాక" యని యనుగ్రహించెను. ఆకారణంబున శూరపద్ముఁడు మహా క్రూరుండగు దనుజేంద్రుఁడై జనియించి కుమారుని హస్తుఁడై యాతని మయూర కుక్కుట రూపముల ధరించి తదనుగ్రహపాత్రుఁడై దేహాంతంబున సాయుజ్య మొందె.

ఇటులే సింహవక్త్ర తారకులును దనుజులై జనించి దేవతా ద్రోహమున కుమారస్వామిచే నిహతులై కైలాసంబున భూతరూపంబులై యుండి వేకొ

క కల్పంబున దుర్గాశాస్త్ర శైశవులకు సింహగజ వాహనత్వము వహించిరి.

ఇట్టిమహా వీరులును- దనుజేంద్రులునైన శూరపద్మ సింహవక్త్ర తారకులు కశ్యప ప్రజాపతికిని మాయకుజన్మించి బ్రహ్మాండంబుల నపరిమితంబుగ బరిపాలించిరి. అట్టివీరులలో శూరపద్మ సింహవక్త్రులను నిరుపురిని గూర్చియే యిందుబ్రతి పాదింపఁ బడినది.

శివరహస్యఖండమునసీయుద్ధకాండము నుపదేశకాండము ముద్రింపఁబడినది. ఈగ్రంథమాల యందు రాబోవు గ్రంథరత్నములు - దేవకాండము-దక్షకాండము- అనునవి. ఈగ్రంథమాలా సముద్ధరణము చందాదారుల యందా ధారపడియున్నది. చందాదారులు తమచందా నొసంగియు - ఇతరులనుచందా దారులుగఁ జేర్పించుటయు నొనరించిన,గ్రంథమాలాగ్రంథము లింతకంటె సుందరముగ బయలు వెడల నవకాశములభించును.

శైవగ్రంథములు పెక్కులు సమకూర్ప వలసియున్నవి. సమకూర్చినవి ముద్రింపవలసియున్నవి. అమూల్యమగు నీశివరహస్యఖండము సంపూర్ణముగ నేటికి ముద్రించబడినది. కాని యెక్కడనో సమగ్రముగా లభించుటలేదు. అందువలన మేము తక్కిన కాండములనుగూడ క్రమముగా ముద్రించి శక్తికొలది భాషాసేవచేయఁదలచితిమి. కొలదిరోజులలోనే సమగ్రముగశివరహస్యఖండమును మాగ్రాహకుల కరకమలముల నలంకరింపఁజేయు యత్నించు చున్నారము.

మాకార్యాల యమునకు యుద్ధకాండము తాళపత్ర గ్రంథముల సమగ్రముగా బంపిన వారిరువురు. వారిలో నొకరు కోడూరిగ్రామవాసులగు శ్రీ. లో. మానుకొండూరుసాంబయ్యారాధ్యులవారు. మరొకరుకరీంనగర వాస్తవ్యులగు మ॥రా॥ ప్రొద్దుటూరి హనుమయ్య గారు. తాళపత్రగ్రంథముల నుండి శ్రమనొందివ్రాసినవారు బ్ర॥ శ్రీ॥ ముదిగొండ రామలింగశర్మగారు. వీరు సర్వరికిని మేమెంతయుఁ గృతజ్ఞులము.

సర్వేశ్వరానుగ్రహమున మా ప్రయత్నములు సఫలములై మాగ్రంథమాల శాశ్వతముగా వర్ధిల్లుటకౌ భక్తులందరుని బ్రార్థింతుము.

సంపాదకులు.

(*)

# విషయసూచిక.

## యుద్ధకాండము - ప్రథమాశ్వాసము.

విషయము. పుట.

## యుద్ధకాండము- ద్వితీయాశ్వాసము.

విషయము. పుట

విషయము. ............ పుట.



యుద్ధకాండము - తృతీయాశ్వాసము.

## యుద్ధకాండము = చతుర్థాశ్వాసము.

విషయము. పుట.

శ్రీ మేధా దక్షిణా మూర్తయే నమః.

# శ్రీ స్కాందమహాపురాణము.

## యుద్ధకాండము - తృతీయాశ్వాసము.





క. మహిళా వర మానస
సీమ సితచ్ఛద సమస్త వాంఛిత ఫలదా!
శ్రీ ముఖువాగలు భూప
క్షేమంకర! కనదపాంగ! శ్రీశివలింగా!!! ౧

వ. అవధరింపుము సకలపురాణార్థ విచార సమేతుండగు సూతుండు కథాకర్ణ
నాసక్తిక ప్రమోదులగు శౌనకాదుల కిట్లనియె నంత. ౨

— వీరబాహుండు యమున కనుజ్ఞయిచ్చి పంపుట. —

తే. శమనుఁడవ్వీరబాహుని చరణములకుఁ, బ్రణతిగావించి భక్తితోఁ బలికె దేవ!
భసితరుద్రాక్షధారుల పథము దేఱి, చూడనామది భయమందు సువ్వె ప్రభువ

వ. భవత్సేవకులు వీరే కైలాస నగరంబున సుఖంబున్నవారలని సన్నిధికిం
దోడ్కొని వచ్చి యాగ్రహంబు సేసి మదీయాపరాధంబు సహింపవలయునని
వినయంబున బలికిన నక్కృతాంతుని కరుణించి వీరబాహుం డిట్లనియె. ౩

క. నీవెపుడు శివ ప్రియుఁడవు, గావున శివభక్తులకును గడుఁబ్రియుఁడవు నీ
భావంబున భయమేటికి, నీవేటికి నకుగుమింక నిశ్చింతుఁ డగుమా. ౪

తే. వీరి నెప్పుడుఁ గనుఁగొని వికలబుద్ధి, నీవె గొనిపోయి తనుచును నేనుచాల
సాగ్రహంబూనర్చితి నదియు నీదు, హృదయమున నుంచవలదు ప్రేతనాథ!

వ. అనియూరడించి వీరబాహుం డనుజ్ఞనొసంగిన శమనుండు నిజభట సమేతుం
డై తనపురంబునకుం జనియె నప్పుడు. ౬

తే. వీరబాహుని మీఁదను విమల వాన, గురిసె నంతయు నిర్జరకోటి దివిని

భూరి కోలాహలంబులం భూత వితతి, సైన్య నాథులఁ గాంచనుఁ సంతసించె.

వ. అంతఁ దద్వృత్తాంతం బంతయుం దెలిసి చారులు శూరపద్మున కెఱింగించిన వాఁడద్ది విని యత్యంత శోకాక్రాంతుండయ్యె. అసురులందఱు శోకంబునొం దిరి. అయ్యగ్నిముఖునిపత్నులు హాహారవంబుల విలపించి రంతయుం. ౯

— శూరతనయులు తండ్రిని వోదార్చుట. —

తే. అపుడు త్రిసహస్ర సంఖ్యచే నతిశయిల్లు శూరతనయులు తండ్రినిఁ జూచి తాపు
శోకమును బొందిపలికిరి శూరముఖ్య! దైవగతికింత చింతింపఁ దగునె మనకు.

మ. అల యష్టోత్తర లక్ష వీరతతితో నబ్భూత సంఘంబుతో
గలవం బోరఁగ నగ్నివక్త్రు ననుపం గా యుక్తమే యిప్పుడు
జ్వల శౌర్యం బతఁడాజి నిల్పుటకుఁ గ్లే శంబేల? చిత్తంబునం
దలఁపు స్థైర్యముఁ బూను మో నృప హిర ణ్యాక్షుండు నీకుండఁగన్. ౧౧

వ. మఱియు రణరంగభీములగు మేము గలుగ నీకివ్విచారంబేల. సముద్రంబు
శోషించినను భవద్బలంబు శోషింప నేరదు. వినుము. ౧౨

మ. అతిరోషంబున మేరుభూధరము వ్య త్యాసంబు గావింతుమో
యతుల ప్రౌఢి శమింపఁజేతుమొ సము ద్యద్బాడబాగ్నిన్ ద్వనీ
ప్సితమున్ జెప్పుమటన్న శూరుఁడనియెన్ శీఘ్రంబ యుష్మద్భుజా
యతతిన్ బాలకు(వంచి రంపితుఁడు ర్దాత పరిత్రాణోన్నతిన్. ౧౩

— శూరపద్ముని యనుజ్ఞగొని యాతని కుమారులందఱు యుద్ధమునకు వెడలుట. —

వ. అని పలికి శూరపద్ముం డనుమతియొసంగిన మహాబలోద్దారులగు తత్కు మారులందఱును యుద్ధసన్నద్ధులై సమ్యగ్రత్నమాలికాలంకృత కంఠులు ను సకల భూషణ భూషితులును సముత్తుంగ శతాంగారూఢులును నగుచు ననేక శూరులు బానటులై చనుచెం, చతురంగ బలసమేతులును, పటుల వాద్యఘోష ముఖరిత హరిన్ముఖులును, ఛత్ర చామరధ్వజ పరిశోభితులు ను, చాప తూణీర ధారులును నై పురంబున వెడలి రప్పుడు. ౧౪

క. శూరసుతులు పేరందఱుఁ, బోరిని శౌర్యోన్నతవు సత్య మగ నింకఁ దనకున్
భారవిమోచనము వని, వారల నటయించె ననఁగ వసుమతి నదరెన్,

తే. దానవప్రలయార్భటాటోప ఘోర దర్పింబులాడెనుల్క ల్బ్రాంతగురి సెమ గ్రముగను

శ్యేనములు కేతనములపైఁ • జెలఁగి తిరిగెఁ, దుశ్శకునము లనేకముల్ • దోఁ
చె నెదుట. ౧౮

వ. ఇట్లు భావి మృత్యుసూచకంబులైన దుశ్శకునంబులు గణింపక దానవా
గ్రణులును రణాంగంబు సొచ్చి రుభయబలంబు లత్తరి నొత్తంబులై మో
హరించె. మహీరుహోపల ధరాధరంబులును వివిధాయుధంబులును గురి
యుచు సంకుల సమరంబు గావించి రప్పుడు. ౧౯

తే. భూతవీరులఁ జేఁబట్టి • భూతలమునఁ, బడఁగవిడిగ సురవరులుది • క్పతుల మునను
వారి మూర్ధశ గనుఁగొని • ఘోరపద్మ,తనయులుం దజమతి రోష • మినుమడింప.

మ. ధనువుల్ సజ్యము లొప్పఁ జేసి కడు ను • ద్యద్ఘోషముల్ మీఱఁగాఁ
గనదస్త్ర ప్రతతుల్ వెసం బరపి యు • గ్రస్ఫూర్తి భూతావళిం
ఘన శౌర్యంబునఁ జంపె నద్భుత వెసం • గళ సంగరోర్వీ వలా
యనముం బొందియు భూతసైన్యపతు లం • దద్ధైర్య ధారేయులై.

వ. మగుడి దానవులపై నురువడించి వృక్షశైలంబులు వైచియు శిలలు రువ్వి
యుఁ బర్వతంబులఁ బరపియు దండంబుల నొంచియు నరదంబుల ద్వ
రదంబుల హయంబుల సారథుల నుగ్గునూచంబు గావించి కొందఱ యురం
బులు ముసలంబుల మోదియుఁ గొందఱ శిరంబులు కుఠారంబుల నఱకి
యుఁ గొందఱ శరాసనంబులు శరంబులం దునిమియుఁ గొందఱ కవచం
బులు కరవాలంబులం దెగవైచియు నిట్లు నానావిధంబుల భూతసైనికులు
పరాక్రమంబు చూపిరి. ౨౦

క. ఘోరతనూభవు లందఱు, ఘోరతమొజయంగ మఱియు • సుచిర హలోఘ
గ్నారాచంబులఁ బరపి రు,దారత భూతాళిమీఁద • ధైర్యము లొలయన్.

వ. తన్మహాశరాసనంబుల వేడిమికిఁ బోడిమి సెడి యొల్లంబోయిన యుల్లంబులుం
దల్లడిల్లు భూతబలంబులం గనుంగొని లక్ష్మీవిరాలలోన విజయుండును జయుం
డును మణిఘోషుండును కరవీరుండును వృషావ్హయుండును మహానందుం
డను ననంతుండును నారణుండును ననఘుండును సకలంకుండును నలిగుణా
కరుండును మారుతుండును శశికంటకుండును శతావర్తియు నాదిగాఁ గల
సహస్రవీరులు వెడలి యద్దురాత్ముల వధించుటకు నాలోచించి వీరబాహు
తో విజ్ఞాపనం బొనర్చి తదనుజ్ఞ నడచి. ౨౧

క. భారతనూజుల మూర్ధాని, వీరసహస్రింబుదార ♦ వీక్రిమ మొనరన్
భూరిశరంబులు గురిసెను, వారక పెడబొబ్బలిడుచు ♦ వసుధ చలింపన్.

వ. ఇవ్విధంబున నమ్మహావీరులకుం బరస్పరంబుగా మహాయుద్ధంబయ్యె నంత.

క. వీరసహస్రిము రథములు, భారత నురుమాడి రవుడు ♦ భారతనూజుల్
వారల శిరులు ధనువులు, వీరవరుల్ దునిమి రుగ్ర ♦ విశిఖావళులన్. ౨౭

వ. మఱియుఁ బర్వతోపమానంబులగు తద్గుప్తరథంబు లన్నియు భంజించిన.

క. దనుజులు ధరణీగతులై, ఘనభూజమహీధరములు ♦ గైకొని శౌర్యం
బునఁ బరపిరి సురతతిపై, ననుపమ కోలాహలములు ♦ నడరంగ మిగులన్.

క. వీరతతులంత వెంటన, వారక నిశితాస్త్రతతులు ♦ వరపి ప్రతాపో
దారస్ఫూర్తిని జెలఁగి వి, దారించిరి తద్ద్రుముక్త ♦ తరుశైలంబుల్. ౨౮

వ. ఇట్లు దునిమి మహాఘోరంబులగు నాగ్నేయాస్త్రంబులు దానవులమీఁద
బ్రయోగించిన నిర్దళితాంగులును రక్తధిరపూరములును నగుచుం గొం
డలు మూర్ఛంజెందిరి. కొండ అసురులు చలంబున నీడంబోక పోవుచు మ
హాబలులగు వీరవరుల నంబుధిమధ్యంబున వైచిరంతయు. ౨౯

శా. వీరుల్ తోడన వచ్చి సంగర సము ♦ ద్వేలావలేపంబుతో
నాహూయ్యాన్య శతాంగులై వినిశితా ♦ స్త్రౌఘంబు వర్షించిరన్
బోరన్ దచ్ఛరపీడితాంగులగుచున్ ♦ బూర్వాసురుల్ కోపవి
స్ఫారోదగ్రత మీర వారిధనువుల్ ♦ భంజించి రెంతేనియున్. ౩౦

వ. ఇట్లన్యోన్యంబు జన్యంబపాదృశ్యంబుగా సలుపునెడ విబుధులు దితిజసంతా
డితులై సంతాపంబునం బొందిరంతయు. ౩౧

క. అంత విజయుండు మహేశ్వరు, మంతుండు వినయంబు దవర ♦ పరభక్తి నుమా
కాంతు పదాంబుజసేవ ని, తాంతము గావించి తొలమిఁ ♦ దత్కృప చేతన్.

వ. బ్రహ్మాఘ్నుఁ బగు ధనుస్తూణ బాణంబులు వడసి దానవులపైఁ గోపాటోపం
బు దీపింప శరవర్షంబు గురిసె నప్పుడు, తద్బాణంబులు రక్షోవ్రాతంబుల
శిరంబులుం జెండి వానితోడన సకలదిగంతంబుల సప్తసముద్రంబులు ఇ
డియె నట్టియెడ.

మ. పున రుద్భూత శిరస్కులై దితిసుతుల్ ♦ స్ఫూర్జన్మహాగర్జనల్

దసరన్ సంగరకేళికిన్ దొడర నుద్య ♦ త్ప్రేక్షి పీరుంపు బల్
కినుకం వారల మస్తకాంఘ్రికరముల్ ♦ కీలాలముల్ జొత్తిలన్
దునిమెన్ దారుణ సాయకప్రతతులన్ ♦ దోస్సార మేపారగన్. ౩౪

వ. మఱియు దానవులు పూర్వంబట్ల సముత్పన్నసర్వాంగులగుచు ననేకవిశిఖం
బులు నిగుడింప విజయుండు మనంబున విచారంబు నొంది. ౩౫

—♦ విజయుండు కుమారస్వామినిఁ బ్రార్థించి భైరవాస్త్రంబుఁ గొనుట. ♦—

ఆ. స్వామి! కార్తికేయ! ♦ సకలశత్రువిదార!, యిమ్మహావిచిత్ర ♦ మేమొ యసుర
మస్తకంబు లెన్ని ♦ మారులు ద్రుంచినఁ, బుట్టుచుండు మరలఁ ♦ బూర్వమట్లు.

వ. వీరల జయించు నుపాయంబు కరుణించవే యని గుహుని హృత్కమలంబు
నం దలంచినఁ గ్రౌంచభేది ప్రసన్నుండై వాని కిట్లనియె. ౩౭

క. విజయా! శీఘ్రమ నీకున్, విజయంబగు నస్మదాజ్ఞ ♦ వీరం దనుజ
వ్రజములఁ బరిమార్పుము నిజ, భుజవిక్రమగరిమ దివిజ ♦ పుంజము పొగడన్.

వ. ఇద్దురాత్ములు పద్మజువరంబున మహా బలాఢ్యులై యుండుటం జేసి వీరల
శిరంబు లేకకాలంబున నొక్క బాణంబున నెవ్వండు ఖండించునప్పుడ నా
శంబు నొందుదు రిందు లోపల నొక్కండు దక్కిన వధ్యులుగా రదిగావున.

తే. ఒకమఱియు నీవు నిశితమా ♦ నొకశరమున, శిరములురువడి దునిమి ని ♦ శ్శేషముగను
గదనతలమున వీరిఁ జ ♦ క్కాడవలయు, నంబుజాననువరమది ♦ సార్థకముగ.

వ. అని పలికి సకల శత్రుసంహారభైరవంబగు భైరవాస్త్రం బొసంగి పార్వతీ
సుతుం డంతర్హితుండయ్యె నయ్యెడ. ౪౧

—♦ భైరవాస్త్రముచే రాక్షసులు చెక్కండ్రు మడయుట. ♦—

క. గుహువరలబ్ధాస్త్రుండై, బహుబలుఁడగు విజయుఁ డపుడు ♦ పటురవమెసఁగన్
దహనజ్వాలలు సగుడఁగ, నహితులపైఁ బరపె నమ్మ ♦ హాస్త్రము పెలుచన్.

వ. అదియు ననేక భైరవాకారంబుల మహాభయంకరంబై చతుర్దేశం గనుంగొ
ని సకలరిపునికరంబు వికలంబయ్యె నప్పుడు. ౪౩

క. ఘనబలవంతుం డనిమెసు, దనుజేంద్రుఁ డొకండు ♦ దానిదళిత మొనర్పన్
సునిశితమగు మాయాస్త్రము, దనరఁ బ్రయోగించె రోష ♦ తామ్రాక్షుండై.

మ. జనముల్ మీరగ భైరవాస్త్రముర భా ♦ స్వద్దీప్తి నయ్యస్త్రముల్
లవమాత్రంబు గణింప కాక్షణమ కీ ♦ లల్ గ్రక్కుచున్ వచ్చి యా

హననాంగంబున నేకకాలమున వ్రయ్యల్ చేసి మూర్ధంబులన్
భువి కూల్చెన్ ద్రిసహస్రదానవగణం బుర్వి విస్మయం బొప్పఁగన్.

వ. ఇట్లు త్రిసహస్రదానవగణంబులుం బడుటం జేసి విజయుండు సముపలబ్ధవి
జయుండై స్కందుని నుతించె. భూతవ్రాతంబులుం గోలాహలంబులం జెలం
గె. నిలింపులు గుంపులు గూడి సొంపలర సుమపరంపరలు గురిసి రయ్యవ ౭౭
సరంబున.

క. అట్టియంతయుఁ గని దూతలు, పదపడి శూరునకు విన్నపం బొనరింపన్
మది వికలుఁడగుచు దానవ, పతకుంజరుఁ డప్పుడు శోకమగ్నుండయ్యెన్.

—ః ధర్మకోపుఁ డనుమంత్రి శూరపద్మునికి ధైర్యంబు చెప్పుట. ః—

వ. అప్పుడు ధర్మకోపుండను మంత్రివర్యుండు శూరపద్మున కిట్లనియె. ౭౯

క. జనకసుత సహజ బాంధవ, జనమృతి కిజ్జగతి శౌర్యశాలులు వీరుల్
మనమున ఖేదము నొందుచు, దనుజేశ్వర! వంతనొందఁ దగునే నీకున్.

క. దితిసుతుల కెల్ల విభుఁడవు, మతిమంతుఁడ వనుదినంబు మాబోంట్లకు ధీ
చతురత గరపఁగఁ జాలిన, ధృతిశాలివి నీకిదేల ధీరత వదలన్. ౮౦

మ. సకల ప్రాణిహరుండు కాలుఁడు ద్వదాజ్ఞాధారియై యుండఁ ద
ప్పక నీకున్ వశవర్తియై విధిగత ప్రాణంబులుం దోడ నే
ప్రకట ప్రౌఢి సృజించు నిట్టు యహహా ప్రజ్ఞావిహీనుండవై
యకటా! దీనుఁడ వోలె నార్తిఁబడుటం న్యాయంబె దైత్యేశ్వరా! ౮౧

మ. విలస చ్చిత్రవిచిత్రితంబయి రణోర్విన్ దిగ్జయశ్రీసము
జ్జ్వలితం గాఁ దొంచిన యింద్రలోక రథమున్ చక్ర నీయధీనంబుగన్
బ్రళయా భీల మహాస్త్రములట్ల గలవన్ బాటిల్లు నీపై న్యముల్
బలమైశ్వర్య ముదారవీర్య మహిమల్ పాటిల్లు నం తేనియున్. ౮౨

క. సేనాధిపతులు మఱియుఁ బ్రధానులగుబలయుతులు గలరు తావకవిభవం
బే నాటికి క్షయంబగు, దానవకులనాథ! యేమిటికి వంత నీకున్. ౮౩

వ. అని మఱియు బహువిధంబుల మహామతియగు ధర్మకోపుండు దుఃఖాక్రాం
తుండగు శూరునకుఁ గ్రమంబున స్వాంతవచనంబులం దెలియం జెప్పిన ని
ని శూరపద్ముండు విగతశోకుండగుచు ధైర్యంబవలంబించి కార్యోన్ముఖు
డై సమరంబున సకలవిపక్షుల బలంబులు నేన గెలుచెదం గాక యని పలి

కిం రోషభూషితుండై వెడలునప్పు డతనికి మహామహోద్దీప్తుండగు ధర్మకోపుం డిట్లనియె. ౫౪

— ధర్మకోపుఁడు యుద్ధమునకు నడుచుట —

క. అనుజీవు లస్మదాదులు, ఘనతరబలులుండ నీవు కదనంబునకున్
జన యుక్తమె బాలునిపైఁ, దనకనుమతియొసఁగు మిపుడు దైత్యాధీశా!.

వ. దేవా! భవదాజ్ఞ శిరసావహించి యేను చని నిమిషమాత్రంబున శత్రుప్రబలం జయించి భవత్సన్నిధికిం జనుదెంచెదనని పలుకు నతని వచనంబులు విని సంతోషంబాడవ శూరపద్ముం డతని కనుజ్ఞ యొసంగి మగుడి సింహాసనారూఢుండయ్యె నయ్యెడ. ౫౫

సీ. ధ్వజపతాకౌఘముల్ ధవళాతపత్రంబు, లాదిత్యమండలం బావరింపఁ
బటహకాహళముఖ్య బహువాద్యరవములు, ప్రళయాబ్ధిఘోషంబు పగిది మ్రోయఁ
జతురంగబలములు సత్ప్రధానాగ్రణుల్, చనుదేర వెంబడి సరభసముగ
సకలాస్త్రధారియై చండతపుండరీ, కాఖ్యదిగ్వేదండ మద్రి నెక్కి
తే. యుల్లసల్లలితాంగ పురవీధు లెల్లఁ గడచి, సైన్యధూతపాళితతి సభస్థలముగప్ప
వంది మాగధసంస్తుతుల్ గ్రిందుకొనఁగ, ధర్మకోపుండు సంగరస్థలికి వచ్చె.

వ. ఇట్లు వచ్చు నతనిం గని భూతంబులు పరాక్రమోపేతంబులై గంతులు వేయుచు సముద్రఘోష భీషణంబులగుచు మహారవంబులు చేసిన యమ్మహాధ్వనులు విని విచారాక్రాంత మానసుండై. ౫౬

ఉ. అంతట ధర్మకోపుఁ డరు దార దురంత నితాంతకోప మ
ర్దాంతిక కార్ముకంబుఁ గొని దారుణలీల గుణారవంబు న
త్యంత మొనర్చి తీవ్రవిశిఖావళులున్ గురిసెన్ మహోగ్రక
ల్పాంత ఘనాఘన ప్రకర మట్లను భూతగణంబుపై వెసన్. ౫౭

సీ. తేజంబు రాజిల్ల దివ్యాస్త్రసంఘముల్, పటుతరప్రౌఢిమఁ బరపి పరపి
నిపుణత మీరంగ నిజనామధేయముల్, పిడుగుల వ్రేల్మిడి నుడివి నుడివి
బహుధనుస్సింజినీ భయదటంకారముల్, చెలరేగి వేమారు చేసి చేసి
యుసుతరాహంకార హుంకారములు మీర, నసదృశస్ఫూర్తి నార్చి యార్చి

సీ. భూతములు దానవవ్రాత ♦ ములునులక్షవీరులును దైత్యమంత్రులు ♦ విక్రమించి
పోరికనోర్వక యుర్వీశ ♦ వ్యాకులమెసంగ, దురము గనుపట్టె నత్యంత ♦ తుముల
మగుచు. ౬౦

వ. ఇట్లు మహాఘోరంబుగాఁ బోరునెడ, లక్షవీరులు నక్షీణ బహోద్దాములగుచు యమదూతలుం బోని వినిశితభల్ల పరంపరల దానవుల ప్రాణంబులు గొనంగనుంగొని కొందఱు నిశాచరులు దిశాంతరంబులకు దిరిగి చనిరప్పుడు.

క. కోపమున ధర్మకోపుం, డేపెసఁగఁగ భూతసేన ♦ నెదిరించి కన
ద్రోపంబులు గురిసె నవా, టోపంబు సమస్తదిక్త ♦ టులునిండంగన్. ౬౧

—♦ వీరబాహుఁడు దిగ్గజవధ మొనరించుట. ♦—

వ. అంత పుండరీక వేదండంబు పరాక్రమోద్దండంబై దలఁపడి యఖండసాహసంబునఁ దక్కిన రిపుమండలంబు శుండాదండంబునం జెండి బెండుపడం జేయుచుఁ బరిమార్పఁదొడంగిన. ౬౩

ఉ. వీరు లుదగ్రకోపమున ♦ విస్ఫురదాశుగ సంఘముల్ మహా
దారుణలీల వైచి రల ♦ దంతిపయిన్ రుధిరాప్లుతాంగమై
వారణముల్ మహోగ్రగతి ♦ వ్రాలి యయోముసలంబు పూని యే
పారఁగఁ జెండెభూతముల ♦ నద్భుతలీల రణాంగణంబునన్. ౬౪

వ. తత్ప్రహారంబుల సారంబులు చెడి భూతంబులు పరిభూతంబు లగు నవియు మూర్ఛాగతంబు లగునవియునై తొడబడియుఁ బడలుపడియు మరల పురికొనం జాలక వెఱచఱచియు నలుదెసలుం బఱచిన. ౬౫

క. అదిగాంచి వీరబాహుఁడు, మదిరోషావేశ మడర ♦ మాతంగముపైఁ
బ్రదరంబులు గురిసిన గజ, మదియించుక బలముదక్కి ♦ యలమటపొందెన్.

—♦ వీరబాహుఁడు ధర్మకోపుని సంహరించుట. ♦—

వ. ఇట్లు హీనబలంబైన దిగ్గజంబుం గని సేదదీర్చి ధర్మకోపుండు కోపంబు గదురనవ్వీరుపై నిశితభల్లంబులు శతాయుతంబులు నాటించిన వీరబాహుండు భిదుర సదృశదేహుండయ్యు నవ్వాడిములుకులకుఁ బోడిమిసెడి రుధిరంబు దొరుగ నిజరథంబున విన్ననైన మనంబునఁ జేయునది లేక నిముసమాత్రం బూరకుండి నయ్యవసరంబున. ౬౭

క. భుజబలం డదిగని శక్తిని, ఘనశౌర్యము మెఱసఁబరపఁ ♦ గనుఁగొని వీరుం

డును దాని దునిమె రయమున, సునిశితవిశిఖమున దివిజసురలు నుతింపన్.

వ. మఱియు వీరబాహుం డమోఘంబులగు శరసంఘంబులు దత్కవచంబు వి దళించిన విగతవర్ముండై ధర్మకోపుండు కోపంబున దండపాణియగుచు నల దధరుండు వోలె దండంబు భుజాదండంబునం బూని సముద్దండంబుగాం ద్రిప్పి వైచిన. ౬౯

క. వీరుండు తద్ఘాతంబులం, బోర నిమిషమాత్రి మూర్ఛం బొందె నసురుండున్ వీరాలాపము బలముల్, శూరతం బేర్కొనుచు సారె శుంభత్ర్పౌఢిన్.

వ. ఆదేవనాయకునిపై ననేక నిశిత సాయకంబులు గురిసిన నవ్వీరుండును బ లంబు చలంబు మెఱయ మహాకోపంబున నద్దనుజుపై నస్త్రంబులు నిగు డించెనయ్యస్త్రంబుల నతండు ధైర్యంబు వదలమి జేసి యసదృశంబగు శ క్తి ప్రయోగించిన నద్దురాత్ముండగు నయ్యసురుండొక శరంబున దానిం దునియలుం జేసె నప్పుడు. ౭౦

క. కని యదియు వీరబాహుండు, గనలుచు దానవునియురము కఠినతరంబున్ దనుమాడె విశిఖమొక్కటి, గొనిశౌర్యముదివిజగణము గొనియాడంగన్.

వ. అట్ట్యెడ దనుజపుంగవుం డేనుంగుపై మూర్ఛాక్రాంతుం డయ్యె నంతకో పంబున మహాబలసాంద్రంబగు నగ్గజేంద్రంబు శుండాదండంబున ముసలం బు బిసబిస విసరి వైచి వీరబాహుని సూతుని విగతప్రాణునిం జేసినంగని.

ఆ. వీరబాహుం డంత వేగంబయరదంబు, డిగ్గి మదినిం గోప మగ్గలింప దిగ్గజంబు గండదేశంబు వడిం జెంపి, నూర్ధ్వమునకుం జిమ్మెనురుపటిమను.

వ. ఇట్లు చిమ్మిన దిగ్గజం బీశ్వరుని చేత గజాసురుండు వోలెం బుడమిం బడి మూర్ఛిల్లె నంత మగుడి లేచి యప్పాపాత్ముండగు నిశాచరుండు దండం బున నవ్వీరబాహు నురంబున వైచిన నతండు కోపవిహ్వలుండగుచు నది కరంబునం గొని తునియలు సేసినం గని. ౭౧

క. దానవుండు మహాకులిశము, వానిపయింబరప వీరవర్యుండు గేలన్ దానిం గొని కోపం బెం, తే నియుం జనియింప నేసె దితిసుతుమీందన్.

వ. ఇట్లేసిన దానవుండు పుడమిం బడియె నంత నవ్వీరబాహుండు నతని పా దంబునం దన్నుటయు రక్తంబు గ్రక్కుచు ధర్మకోపుండు నిహతుండయ్యె నంత దైత్యులతని మోలిన నిలువం జాలక విస్రస్తకేశధరులును విగళితా

యుధులును విషణ్ణచిత్తులు నగుచు వివిధదిగంతంబులకుం బారి రెంతయు.

— దిగ్గజము నిజస్థానమున కేగుట. —

తే. దిగ్గజేంద్రుంబు మూర్ఛదా • జెలిసియంత, వీరభాహుని గని మ్రొక్కి • వినయ మొప్పఁ
బలికె నేను దిగ్గజమును • భవ్యచరిత! నన్ని తఁడుపట్టి తెచ్చెదు • న్నయుఁడిలేందు.

వ. నిగళబంధనంబు గావించి వలసిన యప్పుడు బంధంబులు విడిచి నన్నధిరో హించుచుండును. ఇతని యాజ్ఞ నుల్లంఘింప వెఱతు నిప్పుడు. ౭౯

శా. వైతేయాధిము వీని దుర్మదముఁ జెం • దంజేసి నన్నిప్పుడుం
జేతో హర్షమెసంగఁ బ్రోచితివి దయా • చిత్తంబునన్ నీకు నెం
తే తానున్ రచితాపరాధుఁడ భవ • ద్దివ్యప్రభావంబు ప్ర
ఖ్యాతం బేను నెఱుంగనైతి క్షమఁ జే • యన్వచ్చునా నేరముల్. ౮౦

వ. ఇప్పుడనుమతి యొసంగినఁ బూర్వంబు పగిది మదీయస్థానంబున కరిగెదనని పలికి దీనవచనంబుల నతనికి నమస్కరించి తదాజ్ఞ వడసి ద్విరదంబు స్వప థంబుఁ జేరెనయ్యవసరంబున వీరభాహుపై సురలు కుసుమవర్షంబులు గు రిసిరఖిలభూతసేనలు సంతోషంబునం బొదలె నెంతయు. ౮౧

క. అది సకలము విని మఃఖా, స్వదుఁడయ్యెను శూరుఁడప్డు • శమనంజెలమిన్
గడనహతులైన దైత్యులఁ, బదపడిగొనిపోయి మిగుల • భయపడుచుండెన్.

వ. తదనంతరం భాభానుకోపుండు పూర్వదినంబున మాయం బన్ని రణాంగ ణంబు వాసినది మొదలుకొని నడుమ వృత్తాంతంబు ధర్మకోపునిమరణంబు నుభూతసైన్యంబులు నిజపురంబు చూఱకొనుటయు నిజసూతునివలన విని దుఃఖానలదహ్యమానమానసుండగుచు నాక్షణంబ నిజగృహంబు వెడలి తండ్రిపాలికిం జని నమస్కరించి యిట్లనియె. ౮౩

— భానుకోపుఁడు తనతండ్రికి నీతిగఱపుట —

క. బలవంతులగు విరోధుల, గలనన్ బేర్కొనఁగఁ దరమె • కడమినిమనకున్.
బలశాలి వీవు మును చని, బలుగాసిన్ బొంది రావె • పరిభూతుఁడవై.

క. జనక! యిట్టి సీమముండట, దనమం భయ మగును సెప్ప • దానవబల మెల్ల నిహతమయ్యెను గుహుచే, మన మిఁక జీవించునట్టి • మార్గమెటులకో.

వ. అయినను బ్రతుకుఁ దోవ వచించెద వినుము. బందీకృతులగు బృందారకు

లనందఱ విడిచి స్కందుని చరణారవిందంబు శరణుఁ బొందిన నతండు కృపాకటాక్షంబున మనల నందఱ సంరక్షించు నిదియ కర్జంబనిన ఁదనయు వచనంబులు విని శూరుండు కోపంబు గదుర నిట్లనియె. ౮౬

—♦ శూరపద్ముఁడు తనయునిపైఁ గోపించుట. ♦—

తే. బ్రహ్మవిష్ణుముఖామర ♦ ప్రకరమెల్ల, ననుదినంబును నన్నుఁగొల్తు రధికభీతి
నట్టియేనిఁకఁబౌరుష ♦ మకట విడిచి, శరణమఁచును జనుదునె ♦ శత్రుకడకు.

వ. ప్రాణంబులు కంఠగతంబులైనను నాశపథంబు విడువ నెంతయు. నీవు రేపటి యుద్ధ ప్రయాణంబు దలంపుము. ౮౮

క. ఎంతేనియు ధీరత నా, చెంతను నీవిట్టులన్ వ ♦ చించెద వోహో
భ్రాంత దివాభీతుఁడ వ, త్యంతము శయనింప నరుగు ♦ మటు నెందైనన్.

క. నేను రణాంగణమున రిపు, సేనం బరిమార్చి వత్తు ♦ శీఘ్రం బనుచున్
సూనుండు భానుకోపుఁడు, మానుగ జనకునకు ననియె ♦ మదిరంజిల్లన్. ౯౦

—♦ భానుకోపుఁడు యుద్ధమునకు వెడలుట ♦—

క. క్షమియింపు జనక! నావా, క్యములు మిననక నీమనంబు ♦ గననంటిని న
త్యముగాఁ దలపకు మిదిమది, సమరమున జయింపనేన, చాలుదురిపులన్.

వ. నాకనుజ్ఞయొసంగు మనఁ దనూభవుని వచనంబులు విని రాత్రించరభర్త ఁగ వ్రుండు సంతుష్టాంతరంగుండగుచు నప్రతిమప్రతాపాటోపుండగు భానుకోపునకు దురంబున కరుగననుజ్ఞయొసంగిన నతండు గృహంబునకేతెంచి. ౯౨

మ. జనకాజ్ఞన్ వెస భానుకోపుఁడు మహా ♦ సంగ్రామ సన్నద్ధుఁడై
ఘన దివ్యాస్త్రధనుర్ధరుండగుచు వీ ♦ కం దేరుపై నెక్కి చెం
తను ఛత్రధ్వజముల్ సెలంగ బహువా ♦ ద్యధ్వానముల్ మ్రోయఁగాఁ
దనరంగాఁ జతురంగ సైన్యములు గు ♦ ప్తస్యందనాన్వీతుఁడై. ౯౩

వ. ఇట్లు సమరప్రయాణోత్సుకుండై తండ్రి కడ బాయుటకు విషాదంబు నొందుచుఁ బురవీధులు గడచి సంగరాంగణంబుఁ జేరి యందు హతులై పడియున్న త్రిసహస్రసంఖ్యలగు నిజానుజులను నిశరదనుజులం గనుంగొని శోకాక్రాంతహృదయుండగుచుఁ గోపంబుదీపింప శూరతనయుండు దనమనంబున.

క. ఈశత్రువ్రజ మెల్ల వి, నాశము నొందింతు వెస ర ♦ ణక్షోణి నిశా
తాశుగములు లేకుండిన, నాశౌర్యము మెత్తురే జ ♦ నంబులు జగతిన్. ౯౫

క. వైరుల గెలువఁగ నేనియు, దారిద్ర్యముఁ బొందియున్న • దవ్యథచేతన్
వారవధూసంగమమును, గోరిన జనునట్లు నన్ను • కుంభిని నగరే. ౯౬

—• భానుకోపుఁడు భూతసేనాధిపులఁ బారఁదోలుట. •—

వ. అని వితర్కించి రోషభీషణుండగుచు రిపు సేనలం దాకిన నతనిం గని భూతంబులు మహాభయసమేతంబులై వీఁడెవ్వండో మహాసురుండొక్కండనేక సైన్యంబులతోడ నరుదెంచెనని మనంబులం గుందుచు వీరంబు సెడక ధైర్యధౌరేయులై దలపడి రప్పు డుభయదళంబులుఁ గదిసి మహీధర మహీరుహ మహాయుధాపలంబులును గదా ముద్గర ముసలంబులు మొదలుగా నాయుధంబులు గురియుచు నతిభయంకరంబుగా సమరంబు సేయునెడ. ౯౭

మ. హతులై శూరులనేకులుం బడిరి పో • ద్యల్లీల నర్తించె నా
జతలంబందుఁ గబంధసంఘములు డా • సెన్ మాంసకాంక్షన్ శివా
వ్రితతుల్ గ్రద్దలు కాకముల్ దిరిగె దై • ర్యంబెంతయుం జాలకన్
దితిజశ్రేణుల మ్రోలఁ బారె నపుడున్ • దిక్శ్రేణికిన్ భూతముల్. ౯౮

వ. ఇట్లుఁ బారిన సేనలం గనుంగొని భూతసేనాధిపులు బలంబులం జెయివీచి కినుకవోడమినమనంబుల దనుజబలంబులపైఁ గదిసినిశితశరపరంపరలమర్మంబులు గాడనేసిన ఛిన్నభిన్నాంగులగు నసురులు కనుటుపడి పలాయనంబు నొందినంగని భానుకోపుండు కోపంబున నిశాతభల్లంబులఁ దన్మర్త్యమహాతనుగిరులు చూర్ణంబులు గావింపిచునబ్బురంబుగానిబ్బరంబులగు పెడబొబ్బలిడుచు మిణుగురులిరుగడల సెదర నాగ్నేయాస్త్రంబు లనేకంబులుం బరపిన నవి నోడలఁ గాడి ననుటయు భూతసేనాధిపులు రక్తసిక్తాంగులయి తద్బాణసుట్టముల నెట్టన నిలునంజాలక పలాయనంబు నొందిన. ౯౯

—• వీరబాహు భానుకోపుల యుద్ధము. •—

చ. అది గని వీరబాహుఁడు మ • హాగ్రహ మొప్పఁగఁ దేరు దోలి య
క్కదనధరాతలంబునకుఁ • గార్ముకముం గయికొని విస్ఫుర
త్ప్రదరచయంబులుం గురిసి • భగ్నము నొనర్చి తదాయుధావళిన్
మదమణఁగించె దానవుల • మానిని నిస్తులశౌర్యధుర్యుఁడై. ౧౦౦

వ. అంత భానుకోపుం డమ్మహామహునిం గని మనంబునఁ గనలుచు నిట్లనియె.

శా. దూతత్వంబున వచ్చి పూర్వము మహా ♦ దోర్దర్పముల్ మీఱఁగన్
దైతేయావళిఁ ద్రుంచినై చితివి నీ ♦ ధైర్యంబు నీశౌర్యమున్
ఖ్యాతిన్ గెందుకుఁ జూత మిప్పుడిట నం ♦ గ్రామంబునన్ నిల్వుమా
నాతో నీవిఁక నెందుఁ బోయిన నమా ♦ నప్రేక్షిమం ద్రుంచెదన్. ౧౦౮

వ. అని యిట్లు గర్వోక్తులాడు నిశాచరుం గనుంగొని వీరబాహుం డిట్లనియె.

క. మనమిరువుర మాహవమున, ఘనభృతిఁ బోరుదము దివిజ♦గణములు నింగిన్
దనరుచు సంతోషంబులఁ, గనుదురు జయమపజయంబు ♦ గనిమ దలిర్పన్.

వ. రిత్తమాటలాడిన దాన నేమియగు. మగఁటిమిఁగలవాఁడవేని నాతోడ నిమిష మాత్రంబు రణంబు సేయఁ బూను మనవుంతు భానుకోపుండు కోపంబు గదుర భిదుర సదృశంబగు నమ్మహావీరు నరదంబు తీవ్రంబగు నారాచ సహస్రంబుల నొప్పించిన. ౧౦౯

క. కోపించి వీరబాహుఁడు, పాపాత్ముండగు నిశాటు ♦ బాహుయుగళమున్
చాపసహస్రము గ్రుచ్చెఁ బ్రి, తాపము మెఱయంగ సమర♦ధాత్రిస్థలినిన్

క. అసురుఁడంత మహోగ్రత, నసదృశగతిఁదూనిమొనతని♦యంబుల పొదియన్
వెసవీరుండా దైత్యుని, నొసలఁ బ్రయోగించె శక్తి ♦ నూల్కొన కసిమిన్.

వ. తచ్ఛక్తి ఘాతంబున సురవిరోధి శిరోధి వ్రీలవై చికొండొకసేపు మూర్ఛాగతుండయ్యె నయ్యెడ. మఱియు వీరబాహుండు వాయువ్యంబుఁ బ్రయోగించెనంత.

ఆ. కడిమిమెఱయు నాజి ♦ ఘనరోషవిస్ఫూర్తి, దనుజుఁడదిహెచ్చైచి ♦ దనిమెదాని
వీసుఁడలుకనగ్ని ♦ విశిఖంబుఁ బఱపిన, దానిదానఁద్రుంచె ♦ దానవుండు.

వ. ఇట్లుత్రుంచి రోషంబున సౌరాస్త్రంబు ప్రయోగించిన వీరబాహుం డయ్యస్త్రంబున దానివిదళించె నంత భానుకోపుండు గోపంబుతోడ రిపుభయంకరుండగుచు సర్వసంహార కారకంబగు బ్రహ్మాస్త్రంబుఁ బ్రయోగించిన. ౧౧౦

తే. అదియు వారించె బ్రహ్మాస్త్ర ♦ మడరనేసి, వీరబాహుండు సాహసో♦ద్వేలుఁడగుచు
నఖిలనఖిల దివ్యాస్త్రముల్ ♦ వ్యర్థముగను, బోవ దానవనాథుండు ♦ భూరి పటిమ. ౧౧౧

వ. మఱియు మహాఘోరంబగు నారాయణాస్త్రంబుసంధించి వైచిన నయ్యస్త్రం
బ్రభావిభాసిత దశదిశాంతరాళంబై మహాకరాళంబగుచుండ నవ్వీరబా
హుండు గనుంగొని తానును నయ్యస్త్రంబు ప్రతిసంధానంబుచేసె నప్పుడు.

క. అవియుఁ బరస్పర ఘర్షణ, జవమడరంగఁ బోరిపోరి ♦ సమలుమ నిలిచెన్
ద్విజపరిపంథి యంతట, దపశిఖ సంకాశకోప ♦ ధారుండగుచున్. ౧౧౩

వ. ఇంకేను సర్వశత్రు నిషూదనంబైన పాశుపతాస్త్రంబు విడిచిన నతండది
యె నిగుడించుం గావున దానఁగార్యంబు నిరర్థకంబగు నని వితర్కించి.

క. మాయావి గాన దనుజుఁడు, మాయ నదృశ్యుఁడు నగుచు ♦ మారుతమట్లన్
సాయక వృష్టిని నలుదెసఁ, బాయక ద్రిప్పుచును వీరు ♦ పై వర్షించెన్. ౧౧౪

వ. ఆసమయంబున వీరబాహుండు శిదుర సదృశ దేహుండయ్యును నమ్మహాశర
ఘాతంబుల రక్తసిక్తాంగుండగుచు నిద్దురాత్ముండగు దనుజుండెందుఁ జనికొ
నెనో, తద్విశిఖంబులు నాపయిం దొరఁగుచున్నవి. వాఁడలక్ష్యుండయ్యె బా
ణంబులు లక్ష్యంబులగుచున్నయవి యని వ్యాకులచిత్తుండగుచు నలుగడ
లం గలయ విలోకింపుచు ఱిచ్చపాటొదవం జేయునది లేక విన్నునై మిన్నక
యుండె నయ్యవసరంబున దేవతలు భూతసేనాధిపులును భయభ్రాంతులై
రెంతయు. ౧౧౫

మ. అనయం బత్తరి వీరబాహుఁడు నిజ ♦ స్వాంతంబునం దైవమా
య నిరూఢిం గని సర్వదీపకముజ్ఞా ♦ నాస్త్రంబు సంధించి త
ద్ఘనదీప్తిన్ గగనంబునన్ సరథుఁడై ♦ గన్పట్టు రాత్రించరుం
గని కోపంబునఁ దేరుతోఁ గదిసి సం ♦ గ్రామం బొనర్చెన్ గడున్. ౧౧౬

వ. అప్పు డయ్యిరువురు పరస్పరంబు నరదంబులు నలుగడలం ద్రిప్పుచు బలు
ఘోషంబుల రొప్పుచుఁ బ్రళయకాలఘనాఘనంబుల పగిది శరవర్షంబులు
గురియుచుఁ బ్రవర్ధమానశౌర్యధైర్యంబుల మెఱయుచుఁ బ్రిదరంబులు వి
డుమిపుడ మద్బాణంబుల భవత్ప్రాణంబులు గొనియెద నాముందర నీ వెందుఁ
జని యెదవని యన్యోన్యంబులు శపథంబులు వెలయఁ బ్రభావంబు లుగ్గడిం
పుచుఁ బాదుషంబులు మించి నిజనామంబులు నుడివి పరాక్రమంబులు ప్ర
కటింపుచు బలుమరు నొంకారుశరంబులు ఖండించి పదుపయినిశితకాండం
బులు నించుచుం బరస్పరంబు పటుశిలీముఖాఖంబులున మోఘంబులు గా

వింపుచుఁ శోణితలంబులఁ దొడఁబదట్టి బెట్టుగ నట్టహాసంబులు సెలంగఁ దా ర్కొనుచుఁ బగర కుత్సాహం బొదవం బరనామంబులు పేర్కొనుచుఁ బ్రకీ ఘటించి కోలాహలంబు లడర శంఖంబులు పూరించుచుఁ బను షోక్తుల లర నీసున నిత రేతరంబు భర్జింపుచు బహువిధంబులం బోరి రప్పుడారణంబ తిదారుణం బతిక్రుములంబుగాఁ జూపట్టె నెంతయు. ౧౧౮

క. భూతలము తత్కదంబ, వ్రాతంబులు గప్పె వసుధ • వ్రాలిరి దైత్యుల్
భూతములు దొరఁగెనట్లన, భీతిల్లె రణంబు గాంచి • పెలుచగ్రహాఃబుల్.

వ. మఱియు దాహకత్వంబునఁ బ్రళయాగ్నిసమంబులును వేగంబున వాయుతు ల్యంబులును మారకత్వంబునఁ నంతకోపమానంబులును బ్రకాశంబున నాఃత్య సంకాశంబులును మహారవంబునఁ నశనిసదృశంబులును సంహారకత్వంబునఁ ద్రి పురాంతకాస్త్రనిభంబులునగు నానావిధశస్త్రంబులఁ బోరి పోరంబరిపియుంద నవి సనక వల్లులగుచుం దలఁపడి హరిహరియును గిరిగిరియును కరికరియునుం బోలెఁ బరస్పరంబుఁ బెనంగిరి. ౧౨౦

క. గగనంబు దిశలు వనధులు, నగములు నిండెఁ దదీయ • నారాచంబుల్
భుగభుగ మంటలు గ్రక్కుచు, ధగధగ వెలుఁగుచునుమిగుల • దారుణభంగిన్.

తే. అంబుదంబులుఁ ఛిన్నభి • న్నంబులయ్యె, గ్రాలెనుడుపఙ్క్తి బెదరెను • గ్గజములప్డు
నంబునిధులెల్లఁ గోపిల్లె • నచలములును, గంపమొందెను వద్ధాత్రి • ఘుర్ణమున.

వ. తచ్ఛరానలధూమం బజాండంబు నిండె నెంతయు. ౧౨౩

క. ఆరణకేళిఁ గనుంగొని, యారపరాక్రమము ధైర్య • మార బలంబుల్
వీరికివీ రేసములని, వారకఁ గొనియాడి రమర • వర్గము మునులున్.

వ. అంత భానుకోపుండు కోపాటోపంబున శతసహస్రంబుల వీరబాహునరదం బు వరియలుం జేసె నప్పుడు. ౧౨౪

తే. వీరవర్యుండు రోషించి • వేగఁదునిమె, నసురునరదంబు బాణస • హస్రములను
మఱియుఁ దనుజుఁడు ముప్పది • మార్గణముల, వీరువక్షంబు నాటెను • విస్మయముగ.

వ. వీరబాహుండపుడయ్యుఁ గేలం దనిమి పదునాలుగు నిశిత విశిఖంబుల నిశా టమకుటంబు పుడమిం బడవైచె నంత. ౧౨౬

క. అసురుండన్నియు శరముల, వెసఁదునిమలుగానెనర్చె • వీరునికవచం
బసుకవిలు వీరబాహుఁడు, లసదుగ్రగతి నేసుశరము • లనుమనుమాడెన్. ౧౨౭

క. శకలీకృతకార్ముకుఁడై, భ్రుకుటీకుటిలాననుఁ దనుజ ♦ పుంగవుఁ డుద్దీ
ప్తకమలజదత్తశక్తిన్, బ్రకటితముగఁ బరపె వీర ♦ బాహునిమీఁదన్. ౧౨౮

క. వీరుండాశక్తి వడిన్, వారక శతకోటి శస్త్ర ♦ వర్షము గురిసెన్
నారాచములవి నడుమ ని, వారించి సమీపమున కుఁ ♦ బడినది రాగన్. ౧౨౯

క. అనుపమబలుఁ డాశక్తిన్, గని వీరుఁడు కార్తికేయుఁ ♦ గారుణ్యపయో
నిధిఁ దలఁచి యుగ్రఖడ్గం, బున దానిం గూనిమె సుకలు ♦ వొంగడ ముడముగన్.

వ. అంత వీరపుంగవుండు కోపంబున ఖడ్గంబు నిడి యూరకుండె నయ్యెడం మ
హాపాపాత్ముండగు భానుకోపుండు కోపంబు గనుఁ గరాళంబగు కరవాలం
బుఁ గొని ద్రిప్పి సింహనాదంబొనర్చుచు వీరబాహుపయిం గవిసినంగని యు
తండు సునిశితవిశిఖంబుల వజ్రనిష్ఠురంబగు తద్వక్షస్థలంబు భేదించెనప్పుడు.

క. దనుజుఁ డదియు గణింపక, తనువున రుధిరములు దొరుఁగఁ ♦ దద్దయు వేగం
జనుదెంచి వీరబాహుని, ధనువఱిముఱిఁ ద్రుంచె ఖడ్గ ♦ ధారన్ గినుకన్. ౧౩౨

వ. ఇట్లు త్రుంచి సింహనాదంబు సేయుచు నలుగడలఁ దిరుగుచున్నంత వీరబా
హుండు ఖడ్గంబు గొని చూపరులు వెఱగంద నతనితోడం దలపడియె. అ
ప్పు డయ్యిరువురకు దహనశమనులకుం బలె ఖడ్గయుద్ధంబు మహాభయాన
కంబై చెల్లెనంత. ౧౩౩

క. పాపాత్ముఁ డసురుఁ డుగ్రతర, కోపం బడరంగ వీర ♦ కుంజరు భుజమున్
దీపిత కరవాలంబున, నేపెసఁగఁగ నేసె దోస్స ♦ మిద్ధ ప్రౌఢిన్. ౧౩౪

వ. వీరబాహుండు దాని నిరర్థకంబుఁ జేసి తద్ఘాతంబు సరకు గొనక సంగరక
ళాకౌశలంబు మెఱయఁ గోపోద్దీపితుండై కౌక్షేయకంబున నతని దక్షిణ
హస్తంబు ఖండించిన. ౧౩౫

తే. మఱియు దనుజుండు దాఁ గేలమండలాగ్రి, మలఁకొని మీఁద జనుదెంచు ♦ నంతలోన
వామకరము ను దునిమెన ♦ వార్యపటిమ, వీరవర్యుండు దివిజులు ♦ వినుతి సేయ.

వ. అంతఁ గోపంబున నంతకోపమానుండగుచు దానవుండు మాయాస్త్రంబుఁ
బ్రయోగింపఁ దలంప నాక్షణంబ యుదారబాహుండగు నవ్వీరబాహుం
డాహవంబున నతని శిరంబు పర్వతశిఖరంబునుం బోలెఁ గరవాల ధారం

డునిమి పృథివీతలంబునం బడవైచె నంత. ౧౩౭

క. హతుఁడగు నసురనింగనుఁగొని, యతిశయముగఁ గురిసిరమరు ♦ లలరుల వానల్
కుతుకమున నార్చె భూత, ప్రితతియు హర్షించె మిగుల ♦ భానుఁడు దివిన్.

— ♦ వీరబాహుఁడు కుమారస్వామిచే సన్మానింపఁ బడుట. ♦ —

వ. ఆసమయంబున వీరబాహుండు గగనంబు విడిచి భూతలంబునుం జేరి స
హోదరులు వీరులు దన్ను నలంకరింప సొంపెసంగుచు నిష్పాపాత్ముం డ
సురుండు నీల్గుట నాచేసిన ప్రతిన చెల్లె పూర్వదినంబుగదా గుహునియు
క్తుండనైతి నని పలికి సంతోషంబున వాద్యఘోషంబులు మెఱయ హే
మకూటపురంబున కరిగి స్కందుమందిర ద్వారంబున నిజరథావతరణం
బుఁ జేసి యంతఃపురమున దివ్యమంగళవిగ్రహుండగు గుహునింగని యతని
పాదారవిందంబుల కతివినయంబునఁ బునఃపునః ప్రణామంబులు గావించిన.

క. సేనాని వీరబాహుని, మానుగ హస్తములనెత్తి ♦ మన్నన దనరన్
దేనియ సోనలు గురియఁగ, వీనుల విందుగను బలికె ♦ వీరుని తోడన్.

క. చల పోరి భానుకోపుని, గలనం బరిమార్చి మిగులఁ ♦ గాసిలితి మహా
బలు సంతసిల్లె నామది, చెలువుగ నీయిష్టమేమి ♦ చెపుమా యనినన్. ౧౪౧

వ. బాహులేయునకు వీరబాహుండు కృతాంజలియగుచు నిట్లనియె. ౧౪౨

క. నీకృపదనుజుని గెలిచితి, నాకేమి ప్రయోజనము వడు ♦ నాయీప్సితమున్
జేకూరఁ గరుణ నొసఁగుము, ప్రకట భవదీయపాద ♦ పంకజ భక్తిన్.

వ. నాకు హరిబ్రహ్మాది పదంబులేనియు నకాంక్షితంబు లగుచుండు సకలశ్రే
యః ప్రదంబగు భవద్భక్తి నాకిష్టంబై యుండునని ప్రార్థించినఁ బార్వతే
యుండతని కనన్యసులభంబగు నిజభక్తి ప్రసాదించెనంత వీరబాహుండు
గుహునకుం బ్రణమిల్లి సహోదర సమేతంబుగా జనియెనని చెప్పి సూతుం
డు మఱియు నిట్లనియె. ౧౪౪

క. ఈవీరబాహు విజయము, భూవలయములోన వినిన ♦ పురుషులభీష్ట
శ్రీ వెలయుచు సమరోర్విమహా, విజయముగాంతురీశ్వ ♦ రాత్మజు కరుణన్.

వ. వినుండు తత్కథా శ్రవణంబునఁ బాండవులు రణంబునం దుర్యోధనాదు
ల జయించి ధర్మమార్గ నిరతులై వెలసిరి. జామదగ్న్యియు నిదివిని బలపరా

క్రమ సంపన్నులైన కార్తవీర్యాదుల గెలిచె. ఋషిముఖంబున నాకర్ణించి
వాలియు మారుతాత్మజుండ జేయులగు ననేకశత్రువుల సంహరించెనని ప
లికె మఱియు నిట్లనియె. ౧౪౬

— శూరపద్ముఁడు మున్నగువారలు భానుకోపుని మరణవార్త విని దుఃఖించుట —

సీ. అంతశూరపద్ముఁ డాత్మజనిధనంబు, నెఱిఁ దూతముఖము వలన దెలిసి
శోకభరముచేత సుక్కుచుఁగడు మూర్ఛ, నొందిపడియె నప్పు డుర్విమీఁద.

వ. ఇట్లు మూర్ఛిల్లి కొండొక దడవునకుఁ బరిచారకులవలనం దెలివొంది యి
ట్లని విలపింపం దొడంగె. ౧౪౭

క. హా పుత్ర! భానుకోపుఁడ!, నీపటుతర భుజబలంబు నేఁడణఁగెనొకో
నీపేరనుడువ భానుం, డేపట్లను వెరచుభీతి నీకమానెగదా. ౧౪౮

క. నీకిట్టులైన చోఁ, నాకులు సుఖయింపఁగలరు నారాయణుఁడున్
భూకమల లూరులొత్తఁగ, జోకం శయనింపఁగలఁడు సుఖమున నబ్ధిన్.

క. త్రిదివంబున గిరిభేదియు, సుదతీమణి శచినిఁగూడి సొంపుగ నోహో
ముదమందఁ గలఁడు కద, నభ్యుదయంబును బొందగలరు భువి విక్రతులున్.

వ. అని మఱియును. ౧౫౨

ఉ. హాయని మోహబుద్ధినవ హాయని శాతశిలీముఖోగ్రచా
హాయనివార్యధైర్యనగ హాయనిమేష విభంగ సుప్రతా
పా యనిశాశ్రితస్థితకృ హాయనిలోపమవేగ భానుకో
పాయని యేడ్చు ఖేదహృదు హాయనిహానిని బొంపలేకొగిన్. ౧౫౩

వ. ఇవ్విధంబున విలపించు సమయంబున. ౧౫౪

క. దనుజులు గొందఱు తనతన,యుని శీర్షకబంధపాణు లొగిఁగొని తేరన్
గని యా యవయవములు గ్రమ, మున సంధించి యసురపతి పొగిలె మన
మునన్. ౧౫౫

వ. అయ్యవసరంబునఁ బద్మకోమల సపత్నితోడ చనుదెంచి కుమారునాగం
బులుం గని భూతలంబునం బడి లేచి తదవయవంబులు గరంబునం బట్టి మూ
ర్కొనుచుఁ గన్నీరు దొరఁగఁగఁ గుచభరంబు సెదర నురంత శోకాక్రాంత
యగుచు నిట్లని విలపించె. ౧౫౬

క. కమలాకర సంస్థితమగు, కమలము గావలయునంచు • గాంక్షించిన శీ
ఘ్రిమఁ దెచ్చినాకొసఁగెను, కొమరుండితఁడివ్విధమున • కుంభినిఁ బడెనే.

క. సురలెల్ల తనకునిష్వైధి, పరితాపమొనర్చిరకట • బ్రోసించచదెయా
కరణి మహాఖేదమునిజ, తరుణులకీ దోషమిఁకవ్ర • ధాజమునకోఁ. ౧౫౮

వ. అనియివ్విధంబున శూరుండెల్ల దానవులును గాంతాజనంబులును హాతుండ
గు సుతుం బేర్కొని విలపించిరంత దానవేంద్రుండు లేచి కోపోద్దీపితుం
డగుచు నీతుణంబ తాన కయ్యంబునకుంజని సకలశత్రు సంహారకంబు గా
వించి తదుధిరంబున వీరయజ్ఞంబు సలిపి తనూభవుని బ్రీతిఁ జెందం గాక
యని పలికితన్మృతకళేబరంబు సంరక్షించు కొనియుండ రాక్షసుల గొంద
ఱ నియోగించి పద్మకోమలాది భార్యల నంతఃపురంబున కనిచి దూతుం
గనుంగొని యిట్లనియె. ౧౫౯

— • శూరపద్ముఁడు సింహముఖుని రావించి యుద్ధమునకుఁ బంపుట. • —

ఆ. అమిత విభవమొప్ప • నసురాఖ్య పట్టణ, మునకునేగిసింహ • ముఖుని తోడ
భానుకోపముఖ్య • బహుదైత్యనిధనంబు, సెప్పితోడితెండు • శీఘ్రమతిని.

వ. అనినవిని దూత లతిత్వరితంబునంజని నానారత్న విచిత్రంబగు నసుర పు
రంబుసేరి మహాబలుండగు సింహముఖునిఁ గని బ్రణమిల్లి వినయంబున ని
లిచి యిట్లనియె. ౧౬౧

క. దానవవరనీ కెయ్యముఁడు, మానితబలశాలి దనుజ • మాళియు నిపుడెం
తేనియు నినుఁదోతెమ్మని, మానగ నిటకనిపెమమ్ము • మహితబలాఢ్యా.

వ. కావున నాలస్యంబుపలదు శీఘ్రంబుగ జేరవలయుననవుండు నతండువృత్తాం
తంబేమియని యడుగుటయు దూతలు భానుకోపు వధంబు సెప్పినవిని రా
క్షసేంద్రుండు శోకాక్రాంత హృదయుండగుచు శిరంబువంచి కొంతకాల
సేపు చింతించి. ౧౬౩

మ. అతిరోషంబున లేచి తేరుపయి పోవ • దైత్యౌఘి నాహూతుఁడై
చతురంగంబులు సైన్యముల్ గొలుపఁగా • ఛత్రధ్వజశ్రేణికా
యుతుఁడై సయ్యన వాద్యఘోషములతో • ద్యోవీథసేతెంచె న
ప్రతిమానంబగు శూరపద్మపురికిన్ • భాస్వత్ప్రతాపోన్నతిన్. ౧౬౪

వ. ఇట్లు వచ్చి సింహముఖుండు శీఘ్రంబ రథంబుడిగ్గి భ్రాతృ మందిరంబు సొ

చ్చి కక్ష్యాంతరంబులు గడచి యంతఃపురంబున కరిగి యందు ప్రత్యక్షంబై కాంతులు
లుండగు నగ్రజుండైన శూరుంగని పదంబుల కెరగిన సతండు సోదరుం బా
హుతలంబునం జేర్చి కౌగలించుకొనియె నంతయు. ౧౬౫

ఆ. అంతసింహవక్త్రుఁ డగ్రజుతోడ, శౌర్యధైర్యములకు సదనమీవు
ఖేదపడి తిదేల కేవలమీరీతి, తెలియనుడువు నాకు దితిజవర్య!. ౧౬౬

వ. అని యడిగిన సహజన్మునకు శూరపద్ముండు నఖిలంబునుం దెలిపి శీఘ్రంబ నీ
వు రణంబునకుం జని సకలశత్రు సంహారంబు గావించి మగుడ నాసముఖం
బున కరుదేరవలయు నేతదర్థంబు నిన్నిటకు రావించినయది యనవుండు.

క. శూరునివచనము వినికను, వారకసింహాస్యుఁడనియె వ్యర్థం బకటా
ఘోరం జంపితి నిశిచర, వారంబు నొకింతనాదు వాక్యమువినకన్. ౧౬౭

వ. సాక్షాత్పర శివుండు సత్యజ్ఞానానంద మయుండగు వానిం బాలుండనుచుఁ
గలికితి. తత్ఫలంబు నీచేత నిప్పుడనుభూతంబయ్యె నేరికేనియు దైవగతి దు
ర్లంఘ్యంబు నావాక్యంబు నీకునత్యంత దాహకంబగు విషంబయ్యె నిం
క నేమి సెప్పనగు నాకనుజ్ఞయొసంగు మేనుకయ్యంబునకుం జని సకలరిపులం
జయించివచ్చి కాని నీముఖంబు సూడనని పలికినవిని శూరపద్ముం డట్లకా
కయని యసుజ్ఞనొసంగిన. ౧౬౮

— సింహముఖుడు యుద్ధమునకు బయలుదేరుట. —

క. తనవిడిదిఁ జేరి సింహా, ననుడున్ దధిక్షీరమధుగ నానామధువుల్
వననిధులట్లను గోలుచుఁ, జనివహంపపు రాసు లెలమి దృప్తుండయ్యెన్.

క. కౌతుకమొప్పగ బరిమళ, జాతంబులు మేననలది సగలంకృతుఁడై
నూతన వస్త్రాభరణ, వ్రాతంబులుదాల్చి యతుల వైభవ మెసఁగన్.

వ. ఈశ్వర దత్తంబులైన దండచక్రకులిశ శూలంబులును సితర దేవతాస్త్రంబు
లును మహాఘోరంబగు మాయాపాశంబునుం గైకొని దశలక్ష తురంగం
బులుఁ బూనిన రథంబధిష్ఠించి బలపరాక్రమ సహితులగు సేనాపతులును
సుతులును బానటమై చనుదేర భయదనినదంబు లెసంగ నానాయుధ భా
సమానంబులును లక్షవాహినీ సంఖ్యాకంబులును నగుచతురంగ బలంబు
లతోడ శూరానుజుండు పురంబు వెడలె నప్పుడు. ౧౭౦

మ. గజవాజి ప్రకరంబులున్ ఘనశతాంగ శ్రేణులున్ సైనిక

వ్రజముల్ భూతలమావరించె మొరసెన్ • వాద్యప్రఘోషంబులున్,
విజితాంభోధిరవంబులై దెసలఁ బ • ర్వెన్ ఛత్రముల్ చామర
ధ్వజకోట్లొప్పె ననేకముల్ బలురజోవ్రాతంబు గప్పెన్ రవిన్. ౧౭౩

వ. ఇట్లు నడెంచు సమయంబున.

తే. అరదములమీఁద గృధ్రంబు • లాడఁగూసె, కాకసంఘుంబు శుష్కవృక్షముల నెక్కె
యుల్క లెల్లడ వ్రాలెను • యోజనముగుల, దుర్నిమిత్తంబు లెంతయుఁ • దోచె నెదుట.

— • హరిబ్రహ్మాదులు సింహముఖునిఁ జంపి తమ్ము గావుమని వేఁడుట. • —

వ. అంత హరి చతుర్ముఖప్రముఖులు నిఖిల బర్హిర్ముఖులు సమరాభిముఖుండగు సింహముఖుఁగని కాందిశీకులగుచు స్కందుని మరుత్రుం జేరి తత్పాదారవిందంబులకు వందనంబు జేసి కృతాంజలులై యిట్లనిరి. ౧౭౬

క. దేవోత్తమ! కరుణాంబుధి!, గావుము మాకభయ మొసఁగి • ఘనశౌర్యుఁడు శూరాపరజుఁడు సింహాస్యుఁడు, వేవేజను దెంచె సమర విజయోత్సుకుఁడై. ౧౭౭

వ. దేవా! వీడు సహస్రముఖుండును ద్విసహస్రభుజుండును సహస్రయోజనాయామ దృఢతరభుజాంతరుండును మహాబలపరాక్రముండును బ్రహ్మాండ సహస్రశాసనుండును నఖిలవైరి సంహారకుండును మహేశ్వర దత్తమాయాపాశశూలాద్యాయుధ ధరుండును నగుచునుండు మఱియును. ౧౭౮

క. కులనగములు దిక్కుంజర, ములు గూర్మం బష్టనాగ • ముఖ్యులు బహులన
త్ర్వులగుచుఁ దాల్చు వసుంధర, బలయుతుఁడితఁ డేకదినమ • ధరియించు పయిన్.

మ. భువనవ్రాతమితండ జాండ సహితం • బున్ వేగ భక్షింపనో
పు విలాసంబున నొక్కనాడి లేఁడు వి • స్ఫూర్జద్గతిన్ దివ్వి మే
రు [illegible] దండము గాగ గేలఁ గొని నామూర్ధిన్ దదాస్ఫాలనం
బు వడిన్ జేయ ససారమైన యని చెన్ • బూర్వప్రకారంబునన్. ౧౮౦

వ. అదియునుం గాక యిప్పాపాత్ముండు ఛాయావిరాజిత పార్శ్వ ద్వయంబును శంభుదత్తంబునాఖీలంబునగు శూలంబు ధరియింపుచుండును. ఇగనియగ్రజుండు వారుని నేకాదశరుద్రులను నీశాను నింకఁ దక్కిన యాదేవగణంబుల నెల్ల కృపివియుక్తులం జేసి బాధించుచుండు. ఇద్దురాత్ముల దురంబున వ్రక్కించి మమ్ము రక్షింపు మను వేల్పుల దీనాలాపంబులు విని వారి కిట్

యంబు లొసంగి సుబ్రహ్మణ్యుం డాక్షణంబ. ౧౮౧

క. సారథియైన సమీరుని, శేరుం దెమ్మని ప్రియాణ దీపిత నుతియై
ధీరత లేచుట గాంచియు, పారబలాధ్యుండు వీరబాహుఁడు వేగన్. ౧౮౨

వ. సత్యజ్ఞానానంద లక్షణుండునగు స్కందుని పాదారవిందంబుల కెరగి వాక
నుజ్ఞనొసంగు మేము సంగరాంగణంబున సకల శత్రుభంగంబు గావించి వ
చ్చెద ననిన విని గుహుండు మంద హాసవిలసిత ముఖార విందుండగుచు
సాహసంబునకనుజ్ఞ నొసంగిన నతండు నిజగృహంబునకుం జనుదెంచి. ౧౮౩

— సింహముఖుఁడు దశముఖుని సంహరించుట. —

మ. ధృతనానాయుధుఁడై విభూషణ లసద్దివ్యాంబరోపేతుఁడై
యతుల ప్రౌఢిరథంబు నెక్కి జయమై నాశ్రయ్యశ్చులన్ సాహసా
న్వితులష్టాధికలక్ష వీరులును తోడిందోడుసూపం మహో
ద్ధతి నేతెంచెను వీరబాహుఁడు సమిద్రంగంబు సేరంగడున్. ౧౮౪

వ. అయ్యవసరంబున సహస్రాక్షౌహిణీ సంఖ్యంబులగు సకలభూతంబులును స
ర్వాయుధ సమేతంబులై తోడనం జనుదెంచె నంతయు. ౧౮౫

క. సేనాంఘ్రిపరాగము, భానుం గబళించె మొరసె భయసంబుగ భే
రీనిస్సాణ స్వనములు, మానిత కేతనము లభ్రమండలి మెరసెన్. ౧౮౬

వ. ఇట్లు చనుదెంచి యసురబలంబులం గవిసిన య య్యుభయదళంబులు ప
రస్పర హుంకార భయంకరంబులును ప్రకటిత భేరీభూరిభాంకార పూ
రిత హరిన్ముఖరంబులును ప్రస్ఫురిత ధనుర్జ్యాటంకార భీషణంబులును, ప్ర
సారిత నానాస్త్ర ఘంటాఘణ ఘణత్కార ఘోషితంబులును, పరిభ్రమి
త కేతన పటపటత్కార భయానకంబులును పరిభ్రమ రథనేమీనినద భ
యదంబులును, పవనజవనకంఖాణ హేషారవ భైరవంబులును, ఘటగజ
ఘటాబృంహిత ధ్వాన భాసురంబులు నగుచుఁ బర్వతోపలభూరుహంబులు
గురియుచు నిశితవిశిఖంబులు నిగుడించుచుఁ బరశుపట్టిస కరవాలశూలను
లిశ తోమరాదులు పరుపుచు ఘోరంబుగాఁ బోరునవసరంబున. ౧౮౭

క. దనుజులు రణకోవిదులై, మునుకొని తత్క్రౌంచశైల ముఖ్యులు భూరుహముల్
దునిమి దిగంత వ్యాప్తం, బునకుఁ దరిమి రథులఘాత పంజములు నడున్

వ. ఇట్లు రక్కసులచేత నుక్కఁజెడి వెసలకుఁదిరిగి చనుచుఁ గలంగిన నిలునిలుం
డని చెయివీచి నిజబలంబులం బురికొలిపికొని భూతసేనావిభుండగు సిం
హుండు సింహనాదంబు సేయుచు మదగజంబుపై కుఱుకు కొదమసింహం
బుపోలె నసురవీరుల పయింగవిసి చెంత మహోద్దండ దండంబున రిపుసైన్యం
బులఁ జెండి దండధరు దండకని పెనంత. ౧౮౯

క. హరిశౌర్యుఁడు దశముఖసుతుఁ, సురవైరి చమూవిభుండు ♦ శుంభద్గతిచే
నరుదెంచి రోషమునఁ దనరఁ, శరవితతుల సింహువేసె ♦ సమరక్షోణిన్. ౧౯౦

వ. భూతసేనావిభుండు నవియన్నియు దండంబునం జెండి వెండియుఁ గోపంబ
డర దానవు దద్వక్షంబుపై వైచిన నావేటునం గవచంబు నుగ్గునూచం
బు నయ్యె నంత దానవుండు ప్రతిదండంబుం గని యుద్దండంబుగాఁ గే
లం ద్రిప్పుచు సింహునివక్షస్థలంబుపై వైచిన. ౧౯౧

క. దండమతత్పటువక్షో, మండలి సంఘృష్టిరేణు ♦ మయమై పడియెన్
మెండొడ్డి మతీయు దనుజవ, రుండు పరశువు నుంబరపె ♦ రోష భరితంబడరన్.

వ. అప్పుడప్పరశువును భూతసైన్యాధిపుండు దండంబునం జూర్ణంబుగావించి తూ
ర్ణంబుగా నతని బాణాసనంబు దునిమిన. ౧౯౩

క. దానవుఁ డతికోపోజ్జ్వల, మానసుఁడై శక్తిఁ బరపె, మహిమ సెలంగన్
దానికి భూతగణాగ్రణి, మానిత చక్రిమునఁ దునిమె ♦ మగటిమి దనరన్.

వ. అంతదానవుండు ఖండితంబగు శక్తిం గని ప్రచండ కోపంబున మండుచు
దోర్దండంబున వేరొండు దండంబునుంగొని దండధరుని పగిది నుద్దండంబు
గా భూతసేనావిభుం జెండిన నతండు రుధిరంబు దొరుగ నిమిషమాత్రిం
బూరకుండి వెండియు నరుదెంచి కినుక జనింప రెండుచేతుల దండంబులు
గీలించి దశముఖు యురంబుఁ జిదిపె నెంతయు. ౧౯౫

ఆ. అద్దురాత్ముఁ డప్పు ♦ డాననంబున రక్త, ధారలొలుక ధరణి ♦ ధరము వోలె
ధరణిఁ గూలె స్వర్గ ♦ తపాత్రిఁ బైయంత, నసురు లెల్లఁగవిసి ♦ రతసమోద. ౧౯౬

—♦ కనకుని నిశితాస్త్రంబులఁ జూచి యసురులు పారిపోవుట. ♦—

వ. ఇట్లు రక్కసులు పెక్కండ్రొక్క మొగి సమ్మర్దపీడుండగు సింహుని పయిం
గవిసియు నెడ మహాబలుండు సుశ్రీమంతుండును నక్షవీరులలోనుండి కనకనా

భుండగు కనకుండడసొచ్చి కనకపుంఖంబులగు నిశితసాయక నికరంబులుగ
నికరం బెడల నెడలం బరపినం గని తక్కిన నికరంబు భయంబు వడి కంపి
తాంగులచు నసురులు నలుదెసలకుం బరచి రంత. ౧౯౭

— దుర్ముఖుఁడు పలాయనుఁడగుట. —

ఉ. దానవసైన్యనాయకుఁడు ◆ దారబలాఢ్యుఁడు దుర్ముఖుండు కో
పానల భాసమానుఁడయి ◆ యద్దనుజ వ్రజమెల్ల ద్రిప్పి గ
ర్జానినదంబులొప్ప సిత ◆ సాయకముల్ గురిసెన్ రణోర్వినిం
తేని భుజావరాక్రిమ వి ◆ నిర్జిత భాస్కరకోటి తేజుఁడై. ౧౯౮

వ. అత్తరి భూతంబులు మొత్తంబులై మహారవంబు లొనర్చుచు భూధర భూరుహ శిలాప్రకరంబు లద్దురాత్ముని పయిం గురిసె. అద్దుర్ముఖుండుకోపిధారుణ ముఖుండగుచు శతధాదళిత గాత్రుండై రణవంచకుండు గావున భూతసైన్యంబును మాయగప్పె నప్పు డతిపాపాత్ముని మాయం దెలిసి వీరమార్తాండుండు నరుదెంచి జ్ఞానాస్త్రంబు సంధించె నంతయు.

తే. అంత దానవ విభుఁడు మాయను దొలంగి, యలుక పొడమంగ నెక్కఁ
డె ◆ యాజిలోన
నిలచి బాణసహస్రంబు ◆ నిష్ఠురముగఁ, బరపెనవ్వీరుపై భుజ ◆ ప్రౌఢిమెరయ.

తే. వీరమార్తాండుఁడు సహస్ర ◆ విశిఖములను, వానిధనువును ఖండించి ◆ వాడిములికి
నవియుఁ దునుమాడిసప్తవిశి ◆ ఖాస్త్రములను, గంచుకంబును గడువ్రక్కలిం
చి యపుడు. ౨౦౧

వ. మఱియు నిశిత విశిఖంబు లసని గాత్రంబు నొప్పించిన దానవుండు రక్తసిక్తాంగుండగుచు నొల్లంబోవుచు నొక్కింత సేపు మూర్ఛాక్రాంతుండై మరల దెప్పిరిలి యమ్మహామహునితోడ కయ్యంబున కిల్యాకొనక చయ్యన మాయ నదృశ్యుండై పలాయనంబు నొందె. అట్లగుటఁ గనుంగొని దనుజసైనికు లందఱు యథాయథంబుగాఁ బాఱుటం జూచి భూతంబులు విజయసమేతంబులై పరాజితులతోడ ననుసరంబు సేయఁదగదని సింహనాదంబు లొనర్చుచు మరలె నప్పుడు. ౨౦౨

— సింహవక్త్రుఁడు యుద్ధమునకు విజృంభించుట. —

క. దనుజులు పలాయనంబుగఁ, గని సింహముఖుండు వేగఁగడురోషమునన్

జనుదెంచి భయదగర్జా, ధ్వను లడరఁగ సమరమునకుఁ ◆ దారుణపటిమన్.

వ. ఇట్లు సనుదెంచు పర్వతోపమానకాయుండును మహాభీముండును సింహనాదముఖరితదిఙ్ముఖుండును నగు సింహముఖుం గని భూతవ్రాతంబులుత్తుంగంబులగు మహీధరతరుఖండంబులు గుఱిసిన నద్దానవునికరాస్ఫాలనంబునఁ గంపితంబులై తరుగిరులు కొన్ని చూర్ణంబులై యెగసి తారాగ్రహమార్గంబుఁ గప్పెఁ, గొన్ని చిద్రుపలై నేలంబడిన నచట సింహవ్యాఘ్రాదిమృగంబులుం బెదిరి నలుదెసలుం బఱపె నప్పుడు. ౨౦౪

శా. భూతవ్రాతము భూరిభూరుహనగం◆బుల్ నింపఁగాఁ జూచి సు
జాతక్రోధత తేఁప డిగ్గి యపుడా ◆ జండప్రతాపంబునన్
దైతేయాధిపుఁ డమ్మహీధరము లు ◆ ద్యత్తాస్త్రజాలంబులన్
జేతం బట్టి జవోన్నతిన్ బరపె నా ◆ జం గొన్ని భూతాళిపై. ౨౦౫

వ. మఱియుఁ బ్రచండరోషంబున నన్నిశాచరుండు భూతంబులం గొన్నింటిఁ నేలం గేలించి నేలం గొట్టి కొన్నింటిని సూర్యరథంబునఁ బర్వతసముద్రద్వీపంబులం గొన్నింటిని బడవైచియు వెండియు జలంబు రెట్టింపఁ గొన్నింటిని ముష్టిప్రహారంబులం బొడిచియుఁ గొన్నింటిని వ్రయ్యలు గావించియు బ్రహ్మాండకటాహంబు దాటం గొన్నింటిని నెగయవేసియుఁ గొన్నింటిని బిరబిరం ద్రిప్పి దెప్పరంబుగా మోదియు బ్రహ్మవిష్ణుప్రభృతిలోకంబులఁ దొరుఁగ గొన్నింటిని వడిం జిమ్మియుఁ గొన్నింటి నింద్రాదిదృష్టదిక్పాలకుల సదనంబులం బడఁ గెడపియు బడబానలంబునం గొన్నింటినిఁ గూలంద్రోచియుఁ గొన్నింటిఁ బాతాళంబునం బడద్రోచియుఁ గొన్నింటిసం దునిమియు భూతంబుల నఱపియు నమ్మహాబలుండు భూతవ్రాతంబుల సకలదిశలు సర్వభువనంబులు నించి మించిన రోషంబునం జరణతలంబున మెదిపియుం జిదిపియు వ్రేచియు బ్రేచియు శిరంబులుం ద్రెంచియు హాహాక్షణంబుల నవలోకించియు హుంకారంబుల భర్జించియుం గరతలంబుల నలినలిగావించియుఁ గోపంబునం గరగరనమిలియు మగుడ నద్దురాత్ముండు పరశుపట్టిసముసలముద్గరకరవాలశూలాద్యాయుధంబుల జక్కడంచియు నుక్కుమిగులం గులాచలంబులుం బ్రయోగించి నుగ్గునూచంబులు సేసియు నిట్లు ననేకభంగుల సంగరాంగణంబున భూతంబు లన్నింటినిం బరిమార్చె నంతయు. ౨౦౬

క. అపుడు హరిబ్రహ్మాదులు, విప్రలభయ భ్రాంతులగుచు ♦ వేగమ చని రా
జిపలాయనముం బొందుచు, నపరిమితా సంకులైరి ♦ యసువులు పేర్మిన్.

—♦ అగ్నికోపుఁడు సారథిని సంహరించుట ♦—

వ. సింహవక్త్రుం డంత మరల నతిసుందర రథారూఢుండయ్యె నయ్యెడ నగ్ని
కోపుండను భూతేశ్వరుండు సనుదెంచి కోపాటోపంబున నిజపరాక్రమం
బుం బ్రకటింపుచు మహాభీలంబును నతిదృఢంబును నగు శూలంబు సు
ర విరోధిపైఁ బరపిన నదియు నతని వక్షంబునం బడి భగ్నంబయ్యె నయ్య
వసరంబున. ౩౦౮

ఆ. మఱియు భూతవరుఁడు ♦ మునికోప మొదవంగ, సింహనాదమేమిఁ ♦ జేసి కేల
దండమొకటి ద్రిప్పి ♦ తత్సారథినిఁ జెండి, దంశిపురికనంపె దక్షణంబ. ౩౦౯

—♦ అగ్నికోపుఁడు మూర్ఛిల్లుట ♦—

వ. అదియుం గని సింహవక్త్రుండు నిజభుజాదండ మండితంబగు దండంబునం బ
రాక్రమాధిపుండగు నగ్నికోపునిం జదిపిన నతండు మూర్ఛాగతుండై ప
డి నంత. ౩౧౦

తే. దానవేంద్రుఁడు మగుడ రథంబు నందు, వేరొకనిసూతుఁ నియమించి ♦ విక్ర
మమున
భూతనాథుసుమాలిని ♦ బోరఁగదియ, నసురుపై నేసెఁ దాను మహానగంబు.

వ. అప్పుడ ప్పర్వతం బఖర్వ గర్వధూర్వహుండగు నమ్మహాసురుండు బాలుం
డు కంతుకంబు వోలెఁ గేలం గీలించి మగుడ సుమాలి వక్షంబునం బర
నఁ దత్పతనంబున నతండించుక సేపు మోహపరవశుండై పడియె నప్పుడు.

—♦ దండిమూర్ఛాగతుఁడగుట ♦—

ఆ. ఇట్లు వడిన నతని వీక్షించి దండియు, వజ్రకఠినమైన ♦ వాసిరసురథము
దండమునను మోదె ♦ దద్ఘట్టనంబున, నదియు జూర్ణమయ్యె ♦ నాక్షణంబ.

వ. మఱియుఁ గోపంబు గదుర భూతసేనావిభుండగు దండి తుండంబున మహా
సింహంబును జెండు వేదండంబు పోల్కి బ్రతాపోద్దీపితుండగు నద్దైత్య
నాథుని శరంబునం జెండిన నమ్మహాదనుజుం డలిగి పాదంబునందన్ని య
తని నేలం బడవైచి దాన నభోమండలంబు కెగయఁ జిమ్మిన. ౩౧౪

క. దివినుండి ధుమికి దివిజుఁడు, జవ మొప్పగ దైత్యు బాహు ♦ శాఖలఁద్రొ...

ప్లవగవరేణ్యము వోలెను, వివిధగతిఁ గంతులిడిరొ • వేమరు కరుణన్.

తే. మఱియు లతలు సుద్రిమ్మను; మధుపమాల్లునంసమండలి జరియించు • నతని వాన
స్రంసు మత్కీకనువమడు • వోలెఁ గేలఁ, బట్టివలుపుచు దవ్వుఁ • జారవైచె.

వ. ఇట్లు వైచిన భూతేశుండు మూర్ఛాగతుండయ్యె నంత. ౨౧౮

క. సేనాపతు లివ్విధమున, దానవుచే విజితులైన • తత్క్షణమందున్
భూనుత శౌర్యులు వీరులు, మానుగఁ జనుదెంచి సమర • మండలమందున్.

ఆ. నిశితసాయకములు • నిగుడింపదనుజుపై, సవియఁ బుష్పవృష్టి • యయ్యెనతని
కపుడు దైత్యనాథుఁ • డరదంబుదిగి వేగ, సింహనాదమెలమిఁ • జేసికొనుచు.

క. కేసరి వోలె గజంబుల, భాసురశౌర్యమునఁ గేల • పరిపంథుల నెం
తే సమరమునను నిడుకొని, చేసె శరస్పరహతులవి • శీర్ణాంగులుగన్. ౨౨౦

వ. మఱియు రథంబుల తాడన గొందఱ వీరుల పాదఘాతంబుల నింగి కెగయఁ
దన్ని నిహతులం జేసె, నిట్లు బహుప్రకారంబుల వీరవరుల నేపడంచి సం
గనుంగొని భూతంబులు భీతంబులగుచు పరిభూతంబులై మృగంబుల పగిది
దిగంతంబులకుఁ బారె నంతయు. ౨౨౧

—• వీరబాహుఁడు సింహవక్త్రి తనయులనూర్వురను దునుముట. •—

శా. నీరాధ్యక్షుఁడు వీరబాహుఁ డదియున్ • వీక్షించి కోపంబునన్
నారాచంబులు నారిఁ గూర్చి పరపెన్ • నానారిపు శ్రేణిపైఁ
జోరన్ గ్రీష్మఘనాఘనంబు సలిలం • బున్ నించు ఛందంబు దే
నారుల్ ధారుణిఁ గూలి గత్తరి సమ • స్తానీక సంయుక్తులై. ౨౨౨

క. భూరి కబంధంబు లస్త్ర, క్ష్మారముల వహించె మించె • ఘోరపిశాచా
హారవములు మఱి కంకము, లాహూతి ఫలాభిలాష • మడర భ్రమించెన్.

వ. అదియుం గని సింహవదను తనూజులు నూర్వు రమర్షంబున శరవర్షంబు
లు గురిసిన వీరబాహుం డలిగి సింహనాదం బొనర్చుచు ననేక సాయంబు
లు వారలపైఁ బరపె నప్పుడు. ౨౨౪

ఆ. సింహవక్త్రి సుతులు • శితశరంబు లనేక, కోటిసంఖ్య లెలమిఁ • గురిసి రాజి
తావదంశకములఁ • దచ్ఛరంబులు విష్ణు,నరదములును దునిమి • యార్చె
నతఁడు. ౨౨౫

వ. అంత దనుజ సేనలం గల బలుమగలు పలువురుం గూడికొని యతనితోఁ
డ ధనుర్యుద్ధంబు సేయ మనబలంబుల నెవ్వండు చాలండని యాలోచిం
చి ఖడ్గఖేటకంబులు ధరించి మెఱవళ్లుఁ జూపుచు నెక్కువెట్టిన నవ్వీరాగ్రి
ణిఁ జుట్టుకొని రయ్యెడ. ౨౨౬

మ. ఘనరోషంబున వీరబాహుఁడు మహోగ్రంబైన ఖడ్గంబు గొ
బ్బున సంధించి రణాంగణంబునకు విస్ఫూర్జద్భుజాప్రౌఢిమా
రూఢనరాగ్రణిఁ గని సింహవక్త్రసుతులున్ రోషంబు దీపించి యా
తని ఖడ్గంబున నొంపఁ జాలమి సముద్యత్ప్రౌఢి తామందఱున్. ౨౨౮

వ. అతని వధియింపఁ బడి సంహరింపం దలంచు నంతలోన నవ్వీరబాహుండు మొ
క్క బాణంబున నిశితకరవాలంబున నప్పాపాత్ములగు సింహాస్య తనయు
ల నూర్వురం దునిమి వైచి శీఘ్రంబ పరమ మంగళంబగు రథం బధిరో
హించిన నప్పుడు సురలు విరుల వాన గురిసి రెంతయు మోదంబున.

— వీరబాహుసింహవక్త్రుల యుద్ధము. —

ఉ. అంతట సింహవక్త్రుఁ డవి యారసి పుత్రవియోగశోక మ
త్యంతము దుర్నివారమయి యక్కట వీఁడొకరుండు నిర్దయ
స్వాంతత వీరి నందఱను సంహృతిఁ జేసె నటంచు నిగ్గుచే
నెంతయు చింత నొంది మఱి డాఁపెసఁగంగ మహాగ్రహంబునన్.

వ. నైరృతుఁ డేయుండు గావున విక్రమంబు నెక్కొలుపుచు సకల భూతంబుల
నిమ్మహాబలునితోడం గూడ భ్రమింగెద నఖిల లోకంబు లణంచెద నట్లు కా
ని నాకోపంబు ప్రశాంతంబు గాదని తలపోసి రథారూఢుండై వీరబాహుం
గవిసిన. ౨౩౦

ఆ. వీరబాహుఁ డపుడు వేగంబ యెదిరించె, బాహుశౌర్యమెసఁగఁ బ్రధనమునకు
నంత నతనిఁ జూచి యాత్మలో నత్యంత, దర్ప మడరఁ బలికె దానవుండు.

క. ఏరా! యెవ్వఁడవీవు? గు, మారుఁడవో లక్షవీర మండలికోన్నన్
వీరుఁడవో గొనకు నవ, వీరులలో వాఁడవో భువిన్ దూతవకో!. ౨౩౨

వ. సత్యంబుగా నాకెఱింగింపు మనవుడు. ౨౩౩

మ. వినుమా దానవదేవదేవుఁడు మహా ♦ వీరుండు నాకార్తికే
యునకున్ దాసుఁడ నాత్మభావమున ము ♦ న్నుద్యద్గతిన్ వచ్చి దై
త్య నికాయంబు గలంచుచే మెఱుఁగ వే ♦ తా వీరబాహుండు సం
జ్ఞను నేనెవ్వఁడనైన నేమిపుడు పృ ♦ చ్ఛం జేయ నీకేటికిన్. ౨౩౪

వ. అని పలికిన వీరబాహునకు సింహవక్త్రుం డిట్లనియె. ౨౩౫

మ. కరముం దర్పులునైన దానవుల సం ♦ గ్రామక్షితిన్ గూల్చుటన్
వరశౌర్యంబగు నొక్కొ నీకు నరయన్ ♦ మత్పుత్రులన్ బాలురన్
ధరఁ ద్రెళ్ళించుట దొడ్డ పౌరుషమొకో ♦ దర్పింపగా నేల సం
గరమందున్ నిలు నిన్వధించి ముదముం ♦ గావింతుఁ గంకాళికిన్. ౨౩౬

వ. విను మింత మాత్రంబు గాదు నిన్నుం బరిమార్చు నెడనెడ సొచ్చె నేని భ
వన్నాథుండైన గుహుండు భూతసేనా సమేతుండై దేవగణంబులం గూడు
కొని వీరవరులతోడ నరుదెంచె నేనియు సంగరాంగణంబునం బరిమార్చె
దనని సాహంకారుండై పలుకు నతని వచనంబులు శ్రుతిపుటంబులకు నతి
కటువులగుట నించుకించుక విని మనంబునం గనలుచు నేత్రంబుల నుగ్రం
బగు కోపరసంబుం గ్రిక్కుచు నుక్కుసంగ వీరబాహుండు నిశితంబుల
గు దశవిశిఖంబులు గైకొని సింహముఖుని కఠినంబగు యురంబునం జొ
నిపిన నవియు భగ్నంబులై పడియె నప్పుడు. ౨౩౭

క. దండము గొని దానవుఁడు, ద్దండత నవ్వీరుమీఁదఁ దద్దయు వేగన్
గాండంబుల నాల్గిటనది, ఖండించిను రేంద్రుఁ డలుక ♦ గడలు కొనంగన్.

వ. మఱియు శరసహస్రంబు లసుర బృందంబునం జొనిపిన నవియుం బొడియై
నేలంబడియె నంత. ౨౩౮

క. దనుజపతి మఱియుశూలము, గొని భీకరపటిమ వైవ ♦ గొబ్బన నదియున్
దునుముటకు వీరవర్యుఁడు, ఘనదస్త్రసహస్రములును ♦ కడువడి గురిసెన్.

క. శూలం బది తత్సాయక, జాలము ఖండించి యెదుటఁ ♦ జయ్యన తా నా
భీలత వీరుఁడు మఱి శర, పాళి సహస్రంబు గురిసె ♦ పటిమ మెసంగన్.

వ. అదియును శరసహస్రంబుల ప్రతిహతంబు గావించి శూలంబు సత్వరంబు
గా నవ్వీరునుం గదిసిన నతండు సంభ్రముఁ డగుచుఁ గరవాలంబుం గొనిత

చ్ఛాలంబుఁ దునియలుఁ జేసి నవ్వుచు వేలుపులు నవ్వీరబాహు పరాక్రి
మంబు నగ్గించుచు సంతసించి రంతయు. ౨౪౧

మ. మఱియుం గోపవిభీషణుండగుచు శుంభత్ప్రౌఢి నవ్వీరుఁ డ
త్తరి సంధించె మహోగ్రపాశుపతముం దైత్యేంద్రుఁ డాతండు నే
ర్పార తద్బాణముఁ గూని యేసె నపుడంతే యవ్వియుం రెండుఁ డ
గ్గరి యన్యోన్యహరణంబు చేసె మగుడం గాత్ర్యంబులం బేచుచున్. ౨౪౩

వ. వీరబాహుం డద్దైత్యపరాక్రమంబునకు మనంబున నాశ్చర్యంబు నొం
దుచు గ్రహాంతుఁడు దక్క నాకితని జయింప నశక్యం బితని సేనల నేన సం
హరించెదనని కోపోజ్వలితుండై మహాసాహసంబున. ౨౪౪

క. కదనంబునఁ దత్సూతుని, పదునాలుగు విశిఖములను బ్రచండవైన భుజా
మదమున నడిగని దైత్యుఁడు, గదఁ గొని కోపమున బరపె గనువీరుపయిన్.

వ. ఇట్లు వరపిన నదియు వీరవరుని శరీరంబున బడి సహస్రధా భంగంబు నొం
దెనంత నవ్వీరుండు శరసహస్రంబున నతని రథంబుఁ దునిమియార్చి పేర్చిన.

క. భూతంబులెల్ల శైల, వ్రాతంబులు వృక్షములు మఱి బ్రస్తరములు ప్ర
ఖ్యాతబలంబులు దనరఁగ, దైతేయ వరేణ్యు మీఁదఁ దద్దయు గురిసెన్.

వ. అంత సింహముఖుండు కోపోద్దీపితుండై పేరొక్క రథంబధిరోహించి ధను
స్సహస్రంబు గొని భయదంబుగ మౌర్వీనినదంబు సేయుచు బహుకోట్లశి
లీముఖంబులు కోలాహలంబు లొనర్చుచు భూత వ్రాతంబులపై వర్షించె
నంతయు. ౨౪౮

తే. తచ్ఛరాహతి మడిసి భూతవ్రజంబు, శైలవిపినసరిద్ద్వీప సాగరముల
భానుమండలదిఙ్నభోభాగములను, బడియె నేరంధ్రముగను మహాప్రళయమట్లు.

వ. మఱియు జ్యోతిశ్చక్రంబును బాతాళంబును లోకాలోకంబును బ్రహ్మాం
డంబులు నిండె నయ్యవసరంబున జగత్త్రయంబునందు నతని బాణంబులుప
డని ప్రదేశంబు లేదయ్యె నందు. ౨౫౦

తే. వీరబాహుండు నతులితవిక్రమమున, నిశితపటుసాయకంబులనేకములను
గురిసి దురమున నత్యుగ్రకోపమడర, తద్భటావళి నెల్లను ధరణిఁ గూల్చె.

క. ఘోరదేహుఁడు దైత్యసాయక, బృందం బరుదెంచు నధిక వేగంబునఁ దా

దంపినపుడువీరుఁడుశర, సంవోహము పరపినదియు ♦ సారెకుఁదునిమెన్.

వ. ఇట్లు మహాసాహసంబు సూపు నవ్వీరబాహు ధనుర్విద్యాకౌశలంబు గని వియచ్చరు లచ్చెరువంది రెంతయు. ౨౧౩

ఆ. అంత సింహవక్త్రుఁడధిక రోషంబునఁ, బలికెవీరవరుని ♦ పరుష ఘణితి
శ్రుతి కటూక్తులొప్ప♦నతఁడునుభర్జించె, దనుజ విభునిసరకుఁ♦ గొనకమదిని.

వ. అంత నసుర వల్లభుండు సింహనాదం బొనర్చుచు దశసహస్ర విశిఖంబులు మహాఘోరంబుగా వీరబాహుపయిం గురిసిన నతండును దశలక్షశరంబు లనవి యన్నియుం దునుమాడి కోలాహలంబు లడర మఱియు బాణసహస్రంబులు సంధించి గ్రీష్మకాల ఘనాఘనంబుచందంబున నద్దురాత్ముపై వర్షించె నాసమయంబున. ౨౧౫

క. అడిగని నసురుఁడు కోపము, గదురగ దశలక్షవిశిఖ ♦ కాండంబులచే
విదళించి యవియు మఱియును, బ్రదరంబు లనేకకోట్లు♦పరపె నతనిపైన్.

వ. అంత వీరపుంగవుండు తద్విముక్తంబులగు సహస్రకోటి సంఖ్యాకంబులైన శిలీముఖంబు లాక్షణంబ దునిమివైచె నంత సంచలిత హృదయుఁడై దైత్యేంద్రుండు ద్విసహస్రశరముల వీరబాహుని దృఢతరంబగు చాపంబుఁదునిమె గోపంబున. ౨౧౭

క. వీరుండొండొక చాపము, ధీరతఁ గొన నంతలోనఁ ♦ దీక్ష్ణాంబకముల్
వారక ననేకకోటులు, ఘోరంబుగఁ బరపె దనుజ ♦ కుంజరుఁ డలుకన్.

వ. తద్బాణఘాతంబుల రక్తసిక్తాంగుఁడయ్యును బీరంబు సెడక వీరబాహుండు శరాసనంబునం గొనయం బెక్కించి దుర్వారంబుగా శతసహస్ర సంఖ్యాక నారాచంబులు నిశాచరుపయిం గురిసె నప్పుడు. ౨౧౯

క. అసురేంద్రుడు కోలాహల మెసఁగఁ దదస్త్రములురోష♦భీషణుఁడగుచున్
వెసఁ దునిమి లక్షశరముల, దెసలదరఁగమఱియుఁ బరపెఁ ♦దీవ్రశరంబుల్.

వ. అంత మహాబలుండగు వీరబాహుం డవి యన్నియు ఖండించి శస్త్ర సహస్రంబుల నత్యున్నతంబును నతిసుందరంబును నగు నతని యరదంబు భగ్నంబు చేసిన. ౨౨౧

శా. అంతన్ వేరొక తేరునెక్కి కొని సిం♦హాస్యుండు భూభాగ
మత్యంతంబుగఁ జలిచింప వేగముగ నా♦ దైత్య ప్రౌఢిమన్ దోలెడు

ర్దాంతస్థేముఁడు వీరబాహుఁ డురుశస్త్రశ్రేణిఁ ఖండించె సా
శాంతంబుల్ వణక శరాసన సహస్రంబుల్ దదీయుం బోగిఁ. ౨౬౪
వ. అప్పుడు సకలభూతంబులు గుహుపాలన మేతంబులై కోలాహలంబు లొన
ర్చె నంతయు. ౨౬౩
మ. అది వీక్షించి దురాత్ముఁ డద్దనుజుఁ డుద్వృత్తోగ్రిభుఁడై భూతలం
బదరన్ భ్రూకుటిపెట్టి ఘోరమగు మాయాపాశముల్ బూని యు
య్యుదమాటన్ రిపుకోటి నెల్ల పతనం బొందింపు మంతిరించి యే
పొదవన్ దక్షిణమందవై చె సమర ప్రోద్యన్మహా శౌర్యుఁడై. ౨౬౪
వ. అదియు నత్యంత ఘోరంబును నతిగాఢతమోవృతంబును ననవధికారంబు
ను నతులవేగంబును నఖిలరిపుభయంకరంబును నగుచుఁ జరుదెంచె దేవ
దూతలు విలోకించు నంతలోన నవ్వీరబాహుప్రముఖులగు సకల సేనాప
తుల బంధించి పూర్వాచలంబునం బడఁదోసె నంత యు. ౨౬౫

—◆ సింహవక్త్రుఁడు కుమారస్వామిపై యుద్ధమునకు వెడలుట. ◆—

తే. అంత సింహాస్యుఁ డత్యంత హర్ష మొదవ, నతులకోలాహలధ్వను లమరఁజేసె
భండనక్షోణి వెడలి యుర్భకుఁడు గుహుఁడు, తండెచటనుండు ననుచు దూత
లను నడిగె.
వ. అప్పుడు దూత లిట్లనిరి. ౨౬౭
మ. అనఘుప్రోఢిమ హేమకూటనగరం బాదుక షణ్ముఖాస్యుండు పా
వనచర్యుండు మహాబలాఢ్యుఁ డిప్పుడు వర్తించు సాహసి వా
హినులున్ భూతగణంబు గొల్వ ననుమున్ హీనాత్ముఁడై దైత్యుఁ డున్
విని వాసన్ బరిమార్చి వత్తుననుచున్ నేఁబోయె నవ్వేటికిన్. ౨౬౮
వ. అయ్యవసరంబున నిఖిలదనుజబలంబు లతని వెంబడించెను మనదియును గ
ని పవనుండు శరవణోద్భవున కిట్లనియెను. ౨౬౯
ఆ. వీరబాహుప్రముఖు లీరు లందరు నేను, భండనమున బాహుపటిమ దొలఁగి
ప్రాగ్నగంబునందుఁ బడిరి మాయాపాశ, బద్ధులగుచు నింక బలుపు లేమి.
క. దానవవిభుండె నీపై, సేనాన్వితుఁడగుచు వచ్చె శీఘ్రము మనమున్
సేనాని యాతని వచనము, వీనుల విని చటుల రోష విస్ఫురణ మెయిన్.

— కుమారస్వామి యుద్ధసన్నద్ధుఁ డగుట. —

వ. అప్పుడు సింహాసనంబు డిగ్గి దానవుం డెందున్నవాఁడని యుద్ధసన్నద్ధుండై
గుచు బద్మభవానీతంబులైన మణిపాదుకలు మెట్టి కక్ష్యాంతరంబులుం
గడచి నిజమందిరద్వార పురోభాగంబున సమీరవేరితంబగు మహోన్నత
స్యందనం బధిరోహించి. ౩౭౩

సీ. నిధికైటభారులు విరులు సేసలుఁ జల్ల, సురరాజు ధవళచా మరము వీవఁ
జంచాత్రికార్కలిపవంక ఛత్రముల్ ధరియింప, ననలుండు కరదీపి కనువహింప
దండిఖడ్గముఁ బట్టి దండను జెలువొంద, నసురవల్లభుఁడు కాహళము నూద
వరుణుండు కాళాచి వలనొప్పఁ బూనంగ, ధనదుండు వీటికాధరుఁడు గాఁగ
తే. శూలమీశానుఁడు ధరించి మోర్లిలను వ, నమరులాగినఖిలోపచారము
లొనర్ప
భాసురంబుగ దివ్యమై భవముదోప, వెడలె సేనాని శాత్రవ విజయయాత్రఁ.

మ. చెలగెన్ వాద్యరవంబులెల్లెడల భాసిల్లెన్ ధ్వజౌఘంబులున్
వెలసెన్ మౌనిగణంబు సంస్తవములన్ విద్యాధరుల్ బాడిర
య్యలఘుపౌత్రీ(?)మ వందిసంక్తి నిజశౌర్యౌదార్యగాంభీర్య కౌ
శలముల్ వీనులవిందుగాఁ బొగడెను త్సాహంబు చూపట్టఁగన్. ౩౭౪

తే. నారదాదులు వేడ్కఁగానములొనర్చ్చ, యలరధ్వజములుకట్టిరి యక్షవరులు
భూతజాలంబులాయుధములను గేల, ద్రిప్పు చెల్లెడవచ్చి కద్భూతి మెఱయ

వ. అంత. ౩౭౫

మ. అదె వచ్చెన్ రిపురాణ్మదద్విపఘటాదృప్యద్గర్వ సర్వాంకషో
న్మదకంఠీరవ మద్రిరాట్ దుహితృసుం భచ్ఛుక్తి ముక్తాఫలం
బదె యేతెంచె నటంచు నింగిని సుప ర్వాసీకముం జూచి సం
మదమున్ మీరఁగఁ బుష్పవృష్టి గురిసెన్ బాహ్మాదు నద్దేవుపై. ౩౭౬

వ. ఇవ్విధంబున నఖిల జగజ్జేగీయమానుండును నఖిలేశ్వరుండును నశేషభువ
నసృష్టిస్థితిసంహారకారకుండును ననంతకల్యాణగుణాభిరాముండును ననవధిక
సంపత్కరుండును సమరబృంద సంరక్షకుండును నసురకులశిక్షకుండును న
ణిమాద్యైశ్వర్యోపేతుఁడును నఖిల స్వతంత్రుండును నసహమశక్త్యాయుధ

ప్రశస్త హస్తుండును నద్రికోదండసమానుండును నంబికాసూనుండు నగు నక్కుమారుండు మహాబలులగు వీరులతోడ నతివైభవధురంధరుండై పటహాదివాద్యరవంబుల నధఃకరించి మనోహరంబు లగుచు జగత్త్రయంబు నిండిన సకలజన కలకలధ్వనులువినుచు సంగ్రామరంగంబు సేరెనప్పుడు. ౨౭౮

క. హరిచతురాస్యపురోగమ, సురలన్ దూరమున నునిచి • సుబ్రహ్మణ్యుం
డురు శౌర్యనిధులు వీరులు, పరిసరమునఁ గొలువ నొక్కపజ్జ వసించెన్.

వ. అయ్యవసరంబున భూతంబులు బలపరాక్రమోపేతంబులై మహీరుహగోత్రధరోపలంబులుఁ గురియుచు నసురసైనికులతోడ దారుణంబొనర్చి రెంతయు.

సీ. దనుజులవ్వేళ భూతసంతతుల చేత, భంగమొందిరి సంగర • రంగమందు
నదియుఁ గనుఁగొని సింహాస్యుఁ • డాగ్రహమున, ఘోర విగ్రహుఁడగుచు
ను • భూరిమహిమ. ౨౮౧

క. అని పరచెంచెడివానిం, గనుఁగొని భూతంబు లెల్ల • కడురోషమునన్
ఘనశైల భూజశిలలున్, గొని దానవుమీఁదఁబరపె • గూడియొక మొగిన్.

—• సింహవక్త్రుఁడు భూతముల గబళించుట. •—

మ. అసదృక్ప్రక్రమ భూతసంఘముల సిం • హాస్యుండు రోషంబునన్
ద్విసహస్రోజ్జ్వల బాహుదండముల నం • తే దట్టి యొక్కుమ్మడిన్
వెస నించెన్ వదనంబులుం దెరచి యూ • భీలంబుగాఁ గుక్షిలో
దెసలన్ ఘూర్ణిల హుంక్రియోర్భటులు ను • ద్వేలంబు గావింపుచున్.

వ. ఆయ్యవసరంబున భూతంబులు బలపరాక్రమోపేతంబులై తదీయ నాసాపుటంబులను గర్ణరంధ్రంబుల వలనను గొన్ని భూతంబులుం వెడలి దిగంతంబులకుం బరచెఁ గొన్ని వెలుపడ నలవిగాక నుదరంబునన యుండెఁ గొన్ని మహాసాహసంబున నిజాయుధంబుల నతని యుదరంబు భేదింపం బూని యుండె నిట్లు దురితాత్ముండగు నద్దానవుండు సహస్రవాహినీ సంఖ్యాతంబులగు భూతంబులం గబళించి యుటిచియు వీరులను సేనాపతులను గ్రమంబుగన్ గ్రసించె నప్పుడు గుహుండు డాకకుండ నిలిచి తత్సముస్త్రా శ్చర్యంబుగా వీక్షించుచుండె నట్టియెడ. ౨౮౪

క. ఆవృత్తాంతము దెలియుచు, వేవేఁజని దూతలు పుడు • విబుధౌఘవన
దావానలనిభ శౌర్యవి, భావసుఁడగు శూరుతోడఁ • బలికిరి ప్రభువా!

క. నీయనుజన్ముఁడు స్థిరని, కాయంబును వీరభావమూ ఘనబల పటిమా
ననూ మాయాపాశ నిబద్ధులఁ, జేయుచు భూతములమిగ్రింగె జితరిపువీరా!. ౫౭౬

వ. అనిన విని శూరపద్ముం డత్యంత సంతోష భరితాంగుఁడగుచు సద్దూతల
కు దివ్యభూషణాంబరంబులు బహుమతి నొసంగి సహోదరుని కడ కనే
కదానవ్రులం బనిచి తానును సింహాసనంబు డిగ్గి సకల శత్రుభృతుకుండ
గు నిజానుజుం గనుంగొనుచు నుత్సాహంబున సముత్తుంగంబగు గోపురశృం
గం బెక్కి రణాంగణంబున నొంటి నిలిచియున్న గుహునిఁ జూచుచు భీమ
రూపుండును మహాకాయుండును నగు సింహవక్త్రునిం జూచి యెడ తెగని
ప్రమోదంబున వారలపోరుఁజూచువాఁడై యందు వసించె నని సూతుం
డు శౌనకాదులకుం దెలిపె నంతయు. ౫౭౭

ఆశ్వాసాంతము.

శా. క్రీడాశంబర భారహస్త ప్రణమ ద్గీర్వాణ మౌళిప్రభా
భ్రాడంఘ్రిద్వయ యోగిపుంగవ మనః పద్మస్ఫురద్భంభరా!
క్ష్వేడాహార వినోదమోదిత జగ త్కీర్త్యప్రభావోదయా!
చూడాకల్పిత చంద్రభూషణజటా జూటస్ఫురద్యోఘునీ. ౫౭౮

క. లింగత్మాపాలక తన, యాంగణ సురభూజ! శైల జాలింగన హా
రాంగదనలమూకార భు, జంగ! యనంగావలేప సంతమసరవి!. ౫౭౯

మయూరవృత్తం

కంజభవసేవ్యపద కంజయుగ! లీలా, రంజితనమజ్జన! ని రంజనవిలాసా!
మంజులదరస్మితస మంజసముఖాబ్జా!, కుంజరమదాపహర కుంజరముఖాంకా!.

గద్యం.

ఇది శ్రీమ న్మహత్సకల సుకవిజనానుగ్రహపాత్ర కాశ్యపస గోత్ర
కోడూరి యల్లనార్యపౌత్ర శంకరామాత్యపుత్ర లక్ష్మాంబికా
తనయ వినయవిధేయ బాలసరస్వతీ నామాంక వేంక
టాచలకవి ప్రణీతంబైన స్కాందంబను మహాపు
రాణంబున శంకర సహితను శివరహస్య
ఖండంబున యుద్ధకాండంబునందు
తృతీయాశ్వాసము.

శ్రీ మేధా దక్షిణామూర్తయే నమః.

# శ్రీ స్కాందమహాపురాణము.

## యుద్ధకాండము - చతుర్థాశ్వాసము.





బైరకూటలింగా!
తుష్మాంబురిపుతనయాసేవ్య • చరణాబ్జ! భవా
నీబంధుర పరిరంభ
శ్రీబహుకృత కాంతరంగ! శ్రీశివలింగా!

వ. అవధరింపుము శౌనకాదిమహామునులకు సూతుండిట్లనియె. ౨

తే. రాక్షసేంద్రుండు గోపురా•గ్రమున నిట్టు,లుండ శీఘ్రంబ సేనాని• యుద్ధమునకు
వెడలె సింహాస్యు నెదిరించి• పైకొనమున, సింధురముమీఁదఁ బరఁగెంచు•సిం
హమట్లు. ౩

వ. అయ్యవసరంబున దనుజసైన్యంబు పెడబొబ్బలిడుచు గుహునిం జుట్టుకొనియె నంతయు. ౪

మ. అసదృక్ప్రాభవుఁడు కార్తికేయుఁ డపుడు • దుర్లీల నద్దైత్యసై
రసమూహంబులఁ జూచి మశక•ప్రాయంబుగా నెంచుచున్
వెస సుప్తోరగమట్ల చెన్నొనఁగు మా•ర్వాక్ వింట సంధించి యే
పెసఁగన్ జేసె రవం బజాండ మొగి బే• లెత్తన్ మహాగ్రంబుగాన్. ౫

వ. అప్పుడమ్మహారవంబు విని దానవేంద్రతురంగంబు లధోముఖంబులై సొలం గూలె నిట్లగుటం గనుంగొని సింహముఖుండు మనంబునఁ దారక సంహారకుం డితండని నిశ్చయించి యమ్మహాబలుండు గుహుని సమీపంబునకుం జని యతనిం గని యిట్లనియె. ౬

క. భవదాగమనం బేటికిఁ, బవరంబునఁ దుర్మేధుఁ• బ్రతిరోధి తతిన్
ధృవమిది దీనఁ గొదువ సీ, కవునే నీ సచ్ఛౌర్యవ • సరుగుము బాలా! ౭

వ. అనిన నతని వచనంబులు విని దేవసేనా విభుండు మొగంబునం జిరునగవు లొలుక వాని కిట్లనియె. ౯

—॰ కుమారస్వామి, మిమ్ముసంహరించుట కరుదెంచితినని చెప్పుట ॰—

క. దుష్టజనుల శిక్షించుట, శిష్టుల రక్షించుటయును ॰ క్షితిమండలిమా కిష్టంబెంతయుఁ గానఁ(బ్రి), హృష్టాత్మత నరుగుదెంచి ॰ తేనియుచటికిన్.

క. పాపాత్ములైన మీచే, నాపన్నతగాంచె మిగుల ॰ నమరగణం బో పాపపలుమాట లికేటికి, నేపణఁవక మిమ్మువధ్చి ॰ తిచ్చటికెలమిన్. ౧౦

వ. అనిన సింహవక్త్రుం డిట్లనియె. ౧౧

—॰ సింహవక్త్రుండు కుమారస్వామితో వీరంబులు పలుకుట ॰—

క. వీరన్ సర్వసుపర్వా, నీకము విడిపింపనిపుడు ॰ నీచే నగునే మాకు బలరహితమగుచో, నీకామితముల్ ఘటించు ॰ నిక్కం బజియన్.

వ. ఇంక బహూక్తు లేటికి? భవజ్జనకుండేనియు సమరంబున మమ్ము జయింప సమర్థుండు గాఁడు నీవు బాలుండవు సంగరకళాకౌశలంబుఁ జాలమిం జేసిమ ద్భుజపరాక్రమంబు సహింపంజాల వట్లుగావున వాదు వచనంబు విని శీఘ్రంబ నెందేని పలాయనంబ నొందు మింతక మున్ను భవదీయులగు వీర బాహుప్రభృతుల నుదయాచలంబున మాయాపాశ బద్ధులం గావించుట యుఁ దక్కిన భూతగణంబుల గ్రహించుటయు నిఖిల సురలను గారాగృ హంబునం గాసించెట్టుటయు నీవెఱుంగవే? ఒక్కండ విప్పు డవశిష్టుండనై యున్నవాఁడవు. తాదృశంబులగు శౌర్యధైర్యంబులుం గలవాఁడ నన్నున ర్భకుండగు తారకుని విధంబునంజలపకుము మనంబున. ౧౩

క. కొందఱు దురమునహతులై, పొందిరియమసదనమిపుడు ॰ పోఁచిరి దెసలన్ గొందఱసంఖ్యాతంబుగ, నిందుండియు నీవెఱుంగ ॰ వే? నాబలమున్.

క. బందీకృతమగునిర్జర, బృందము గలనైన విడుతు ॰ నేఁటికిఁక మీఁదన్ స్కందః భవచ్ఛౌర్యమునా, ముందరవిడుచింక సమర ॰ మున నిన్నణఁతున్.

—॰ కుమారస్వామి సింహవక్త్రుని వక్షస్థలము నుండి భూతములను వెడలించుట ॰—

వ. అని యివ్విధంబున దురాలాపంబులాడు నద్దురాత్ముని గని భగవంతుం డగు బాహులేయుండు దంతపరిభాచంద్రికలు సాంద్రంబుగా వెలుంగద

సహాససుందర వదనారవిందుండై యొక్క నిశిత విశిఖంబున నతని వక్షం
బున గాడనేసిన రుధిరంబుతోడ నారంధ్రంబు వలనుండి కొన్ని భూతంబు
లు వెడలి సత్వరంబుగా దిగంతంబులకుం బరచె నప్పుడు. ౧౬.

క. దనుజుండు రుధిరరంధ్రము, దనకరమున మూసి యుదరతలమున వెసం ద
క్కిన భూతంబుల నస్త్రం, బున మొనరం బ్రచుర బ్రచండపటురోషము చేన్.

మ. అతిభీమంబగు దండముం గొని సుపర్వారాతి శైలేంద్రజా
సుతుపై వేసిన నమ్మహాబలుఁడు విస్ఫూర్జత్ప్రతాపంబునన్
జతురస్త్రంబులు సూరిరముల్ పరపె దుశ్ఛిత్రంబు లా దండము
ద్ధతి ఖండించి తదీయఫాలమున నత్యంతంబు నాటంగ వేసెన్. ౧౮

ఆ. దానజలము కింతఁ దక్కెడైంత్యేయుఁడు, జఠరబిలము గప్పకొనుము విడిచి
వ్యాఘ్రహృదయుఁడయ్యె నఖిలభూతంబులు, వేగ రంధ్రమువుడ వెడలిచనియె

— కుమారస్వామి భూతముల బ్రతికించుట —

వ. తదనంతరంబ యంతకమున్న సింహవక్త్రాది నిశాచరులచేత నిహతంబు
లైన భూతసైన్యంబులు కుమారకృపాకటాక్షంబున సంజాతచైతన్యులై
లేచి యెల్లెడలవెల్లి విరిసె నప్పుడు. ౨౦

— కుమారస్వామి వీరబాహ్వాది వీరులం విడిపించుట —

ఆ. వీరబాహుముఖ్యవీరులనందఱఁ, దోడి తేరఁగరుణఁ దోడనపుడు
పాశమోచకమగు బాణంబు బరపెను, పార్వతీసుతుండు పటిమ మెఱయ.

వ. అట్లు జనించి యుదయాచలంబున మోహితాత్ములగు యోధుల సముత్ప
న్నబోధులం జేసి మాయాపాశంబు నాశంబు బొందించి యాక్షణంబ వా
రల నెల్ల పుష్పకంబు వోలె వహించుకొని సుఖంబునం దోడితెచ్చి గుహుం
గానుపించి తదీయానుమతి మగుడి నబ్బాణంబు తూణంబు ప్రవేశించె
నంత. ౨౨

— వీరబాహ్వాది వీరులు కుమారస్వామిని స్తుతించుట —

తే. వీరబాహుండు మొదలైన వీరవరులు, పార్వతీనందనుని పాదపద్మములకు
భక్తిఁబ్రణమిల్లి సంస్తుతుల్ పరగఁ జేసి, రార్తులను మమ్ము రక్షించి తను
చు మిగుల. ౨౩

క. దనుజేంద్రు పాపాత్ముఁడు మిమ్మును మాయాపాశబంధమున గాసిలఁ జే
సెనకటా యని గుహుఁ డెంతయు, ననుకమ్రకృప వీరవరుల నాదృతిఁ జేసెన్.

వ. వెండియుస్కందునకు వారలిట్లనిరి. ౨౫

క. ఏమొక వ్రియాస మెఱుఁగము, స్వామీ! నీకరుణ చేత సర్వాపదలన్
వేమారు దొలఁగె సకల, క్షేమాభ్యుదయంబు మాకు సిద్ధించె గదన్.

— కుమారస్వామి రాక్షససేనలఁ బరిమార్చుట —

వ. అనిన స్కందుం డానంద భరితుండై మార్వినాదంబుఁ జేసియభేద్యంబగు
నమ్మహాధ్వని విని సకల దానవ్రలుమూర్ఛిల్లి తోడదెలిసి కడిమి మెఱయఁ
బెడబొబ్బ లిడుచు గొబ్బున దేవసేనానిపై నుగ్రశరవర్షంబులుం గురి
యఁచుం జుట్టి రెంతయు. ౨౭

క. శరవణసంభవుఁ డంతను, స్ఫురితామిష్మమున దైత్యపుంజము మీఁదన్.
శరవర్షంబులు నించెను, నిరుపమబాహుప్రతాపనిపుణత మెఱయన్. ౨౮

వ. అప్పు డయ్యమోఘనిశితముఖంబు లతితీవ్రవిదళఖడ్గాసిశక్తి పరశుతోమరా
ద్యాయుధ సముత్పాదకంబులును నాగమధర్మ సంస్థాపకంబులును నసుర
సంహారకంబులును ననిలమనోవేగంబులును నబ్ధిశోషకంబులును నంబుధర
విదారకంబులును నర్కరథవిభేదకంబులును నపాస్తబడబానలంబులును న
జాండమేరుస్ఫోటన కరంబులును నతిభయదరావంబులును నగుచు దాన
వుల శిరంబులు కరంబులు నేత్రంబులు గాత్రంబులుఁ జెక్కలుఁ బెక్క
లుఁ జక్కాడి మదావళంబుల మదంబణంచి రథంబులు శిథిలంబులఁ జేసి
తురంగంబుల భంగంబులొనర్చి బ్రహ్మాండాంతరాళంబుల నెరవుచు నం
తపార్థివంబగు కమలజాండంబు భేదించి రక్తోదపంకిలం బగునాశరవణో
దకంబులు సొచ్చుచు నితరాజాండంబులం బ్రవేశించి దేవముఖ్యులదక్క
నందలి రక్కసుల నందఱ నుక్కణంచె నొక్కనిమిషంబున. ౨౯

మ. ఇల నాశ్చర్యము కార్త్తికేయుమహిమం బెన్నంగ సంగ్రామభూ
స్థలి నాతండొక బాణమున్ దొడుగఁద చ్ఛస్త్రం బహో వేలు ల
క్షలు గోట్లర్బుదపద్మశంఖము లసంఖ్యాతంబులై మార్గమం
దలరన్ బద్మభవాండముల్ సెరసి దైత్యశ్రేణిఁ గూల్చె గదన్. 30

—॥ హరిబ్రహ్మాదిదేవతలు దురాత్ములగు రాక్షసుల బారినుండిసంరక్షింపవేడుట ॥—

వ. అప్పుడు హరిబ్రహ్మాదిసకలదేవతలు కంపితశరీరులునునున్మీలితనయనులు నగు
చుం గృతాంజలులై దేవా! ఆదురాత్ములగు దానవులంబరి మార్పుము. కృ
పాకటాక్షంబున భవద్భక్తులమగు మమ్ము సంరక్షింపు మని పరమ మంగ
ళుండును నచింత్యమహిమాధారుండును నష్టైశ్వర్యభవ్యుండును నగు కార్తి
కేయుని సంస్తుతించి రంతయు. ౩౧

మ. క్షణమాత్రంబున నిట్లు దైత్యులు గుహా॥ స్త్రవ్రాత భిన్నాంగులై
రణభూమిం బడినం గబంధములు ఘోర॥స్ఫూర్తి నర్తించె తో
షణమునం గాంచెను మాంసలాభమున ధ్వాం॥క్ష శ్యేనకంకాలి భీ
షణతన్ మ్రోసెఁ బిశాచకాకలకల॥ స్వానంబు లెంతేనియున్. ౩౨

క. శరవిద్ధుండై పూర్వము, పరితాపము నొంది మోహపరవశుఁ డగు న
ద్దురితాత్ముఁడు సింహాస్యుఁడు, పరగన్ గతమోహుఁ డగుచుఁ ॥ బ్రాభిఘను
నప్పుడున్. ౩౩

—॥ కుమార సింహవక్త్రుల యుద్ధము. ॥—

తే. సమరమండలిఁ జెల్లిన॥ స్వభటకోటి, భూరిదోఃప్రౌఢిఁ గూలిన॥ భూతతతిని
వికృతమాతృకఁ జెలువొందు॥ వీరవరులఁ, గాంచి మదిలోన రోషంబు॥ గడలు
కొనఁగ. ౩౪

మ. దనుజేంద్రుండు సహస్రకార్ముకము లు॥ ద్యత్ప్రౌఢిమన్ బూని చ
య్యన నేసెన్ దశలక్షబాణములు దే॥ వాధ్యక్షుపై నాతఁడున్
ఘనరోషాప్తిసహస్రసాయకములన్ ॥ ఖండించి తచ్ఛస్త్రముల్
సొనిపెన్ దైత్యుని మేనుగాడ మఱియున్ ॥ స్ఫూర్జచ్ఛర వ్రాతముల్. ౩౫

క. మఱియును. ౩౬

క. పిశితాశియుఁ గోపంబున, దశలక్షలు పరపి శస్త్ర॥ తతులన్ గుహుఁడున్.
భృశకోపవీక్షితాప, ద్విశిఖంబులఁ దునిమివై చె॥ వెసఁ దచ్ఛరముల్. ౩౭

వ. అంత సింహాస్యుండు కోపావేశంబున సహస్రసాయకంబులు గుహుని సా
రథియురంబున నాటించిన నతండు పుష్పిత పలాశంబు వోలె రుధిర ధా
రాపూరితాంగుండయ్యె నయ్యెడ. ౩౮

క. అడిగని షణ్ముఖుఁ డలుకన్, బ్రిదరశతం బుగ్రముగను ♦ బరపిరణోర్విన్
విదళితము చేసిదైత్యున, రదమున్ శౌర్యప్రభాధు♦రంధరుఁ డగుచున్.
వ. అంత సంచలిత హృదయుండై నిలింపవైరి శరకుటంపగములు ఘర్మకాల
పయోధరంబు వోలెఁ దారకారిపై వర్షించె నప్పుడు. ౪౦
క. గుహుఁ డవియన్నియు నడుమన, బహుశరములఁద్రుంచి మఱియుఁ♦బ్రిదర
సహస్రం
బహితునిపైఁ బరపిధను, స్సహస్రమును దునిమెనొక్క♦సారె నిరూఢిన్.
ఆ. దళితచాపుఁడగుచు ♦ దానవుఁడంతట, శూలముగ్రతరము♦ గేలఁ బూని
కోపమడర రచిత♦కోలాహలుండయి, విడిచెదివ్యసైన్య♦విభునిమీఁద. ౪౨
వ. అరుదెంచిన దానిం జూచి. ౪౩
క. ఫాలాక్షతనూజుఁడువడు, నాలుగుబాణములు పరపి ♦ నడుమనఁ దునిమెన్
శూలముఁబటుతరకోపా, భీలుండై సకలదిశలు ♦ భీతిఁజరింపన్. ౪౪
వ. మఱియు దేవసేనావిభుండు నసురవిభునిపై శరసహస్రంబులు గురిసిన న
ద్దనుజాధముండు దండంబున వారించి కృత కోలాహలుండగుచు హాలాహ
ల కంఠుతనయునిపయిం జనుదెంచె నంతయు. ౪౫
క. చనుదెంచు డనుజుఁగనుఁగొని, ఘనరౌద్రవినిద్రుఁడగుచు♦గౌరీసుతుఁడున్.
సునిశితశరముల నేడిటఁ, దునిమెన్ దత్కరము చటుల♦దోర్బలమొప్పన్.
వ. మఱుడ యుత్పన్నంబగు కరంబున దండంబు గొని దానవుండు కోపంబున
దేవవల్లభునిపైఁ బరపిన సురేశ్వరుండునది సహస్రశరంబుల ఛేదించెనప్పుడు.
క. ఫేరితమయ్యెన్ మఱియును, ఘోరంబగు పాశమసుర ♦ కుంజరుచేతన్
వారకనడియుం దునిమెఁగు, మారుఁడుపటిమన్ సహస్ర♦మార్గణములచేన్.
క. దెసలన్ నిండను ఘోషము, లనన్యశముగఁ జేసికొనుచు ♦ నసురవిభుండున్
ద్విసహస్రకరంబులతో, వెనవచ్చెన్ దివిజసైన్య♦విభుఁబట్టుకొనన్. ౪౯
వ. ఇట్లు కరంబులు సాచికొని జనుదెంచు నద్దనుజుం గని గుహుండు కోపం
బుగదురఁ జచ్చుచిడుగుల వోని రెండువేలశరంబులుం దొడిగి సింహవక్త్రు
ద్విసహస్రకరంబులుం దునిమి పుడమిం బడవైచిన నవియు మహీరుహం
బులు వోలె మఱుడ సముద్భూతంబులయ్యె దానవునకప్పుడు. ౫౦
క. ఛిన్నములగు కరములును, త్పన్నకరంబులను గొనుచు ♦ దనుజుండంతన్

మిన్నదర నాచ్చి పటుగ, ర్వోన్నతి గుహుపై నెదిర్చె నసురకోపమునన్. ౫౨

వ. ఇట్లెదిర్చినం గని.

మ. అసదృశోచ్చైర్యుడు బాహులేయుఁ డపుడు ద్యద్బాణ సాహస్రిమున్
వెస సంధించి తదీయశీర్షములు నుర్వింగూల్చి ఖండించి ప్రో
ల్లసదుత్సాహధురంధరుండగుచుఁ లీలం ద్రుంచి ఘోరంబు లౌ
ద్విసహస్రప్రదరంబులున్ బరపియెం దైతేయభుజామండలిన్. ౫౩

వ. అప్పుడు మూర్ధంబులు భుజావ్రజంబులు తోడన పునరుద్భూతంబులై పూ
ర్వంబట్ల పూర్వగీర్వాణునకుఁ జెలువొందినం గనుంగొని సర్వసుపర్వు ల
త్యంతాశ్చర్య నిమగ్నులై భయవ్యాకుల మానసులగుచు దవ్వులం బారి
రయ్యవసరంబున సుబ్రహ్మణ్యుం డాత్మగతంబున. ౫౪

క. వటభూరుహనికటంబున, గుటిలాత్ములు దనుజవతులు ఘోరంబుగ ము
ఘటియించిరి వీరాధ్వర, మటుగావున నతని కిప్పు డాహవమందున్. ౫౫

వ. దళితంబులైన పాణిశీర్షంబులు పునరుద్భూతంబులయ్యె నని తలంచు
చుండ నప్పుడు. ౫౬

క. అసురుఁడు పలికెను గుహుతో, నసదృశమగు భూరిబలము నైశ్వర్యంబొ
సఁగ జరామరణాది, వ్యసన విదూరతయు మాకు నలవడు జగతిన్. ౫౭

వ. అది గావున ఛిన్నంబులైన శిరః పాణులు మగుడ తినకుం జనియించె.
అస్మద్బలంబు నీవెఱుంగ నోపుదువే! కారాగృహాబద్ధులగు సుపర్వుల నింక
స్వప్నంబున నైన విడువనేర్తునే! బాలుండ వగుటం జేసి నిన్ను మన్నించె
ద నెంతేనియు శీఘ్రంబ యథేచ్ఛం జనుమనవుండు నతని వచనంబులువిని
కోపంబుగదుర దివిజసేనా వల్లభుం డిట్లనియె. ౫౮

ఆ. ఓదురాత్మ! రజ్జులోగిబల్కు టుచితంబె, నిలువుమాజినింక నిమిషమాత్ర
మవ్రియత్నమున నణఁగింతునీకొవ్వు, నయ్యాయిదియథార్థ మసురవినుము

వ. అని శంభుసూనుండు గంభీరంబుగాఁ బల్కిన విని దనుజసింహుండు కోపో
జ్జృంభితుండై సమరసంరంభం బెసంగ సింహనాదంబు సేసి ద్వసహస్రక
రంబులఁ దావత్సంఖ్యంబులగు పర్వతంబులు పెకలించుకొని సుపర్వసేనా
నిపయిం బరపిన. ౬౦

క. శరజన్ముఁడు తద్గిరులన్, శరశతమునఁ దుమురుచేసి చయ్యన మఱియున్

స్ఫురదస్త్రసహస్రింబులు, సుకరతరముగఁ బరపె దైత్యుఁ డురముం గాడన్.
క. దితిసుతుఁడురుధిరధారా, ప్లుతవక్షుండయ్యు నగముఁ లును మఱియు మదో
ద్ధతి వికలించుటయుం గని, యతనిశిరములెల్లఁదునిమె హరసుతుఁడలుకన్.
వ. తచ్ఛిరంబులు పూర్వప్రకారంబున మొలుపుసూపెనంత నద్దానవేంద్రుం
డు ఒలపరాక్రమసాంద్రుండగుచు నాప్పులు నిగుడ మగుడి తద్గిరులు గిరి
జా కుమారుపై వైచిన. ౬౩
క. నగజాసుతుఁ డయ్యున్నత, నగములు ద్విసహస్రసంఖ్య నారాచములన్
దెగటార్చి యొగిసహస్ర, ఖగముల ఖడించె మఱియు సురరిపుభుజముల్.
ఆ. మగుడనవియుఁదొంటి పగిదిజనించిన, నవియుఁదునిమె గిరిక హరసుతుండు
మాటిమాటికసుర మస్తక బాహువుల్ పొడమ పారెసారె గోడువెసవియు.
వ. ఇట్లప్లోత్తర సహస్రవారంబులు దునిమి వైచిన నమ్మహా భుజభుజశీర్షప్రరోహం
బులు సకల దిశలును బాతాళంబును భూనభోంతరాళంబును బర్వతసము
ద్రంబులును నీరంధ్రింబుగా నిండె నప్పుడఖిలనిలింపులు గుంపులై యమ్మ
హాధ్వని విని భయంపడి రెంతయు. ౬౬
క. వివృతాస్యములై యెల్లెడ, నవిరళముగ వ్రాలినట్టి యాశిరములు సొ
చ్చి వెనక గుహునిభయంబున, నవినోరులు మూయఖగమ్ముగాదులుమఱిసెన్
వ. అంత పార్వతీసుతుండిది మాయాకృత్యం బని మనంబున దలంచి యొక శి
రంబును బాణిద్వయంబునుం దక్క తక్కిన వన్నియుఁ జక్కాడినఁ దత్కర
శిరోవ్రాతంబులుం గ్రమ్మర నుద్భూతంబు లగుటం గనుంగొని నాసాగ్రం
బున దర్జనిం జేర్చి భర్జింపుచు శాసించిన నితని బాహు మస్తకంబులు
మరల మొలుపు సూపక నిలిచె నప్పుడు. ౬౮
సీ. అహహ! గుహునాజ్ఞ జగతి నేమనఁగవచ్చు,ముడిచికొనిపోయెదా జేల్ల మోములట్ల
తన్మహాభీతివలనహస్తములుదలలు, మగుడ వెడలక దానవమౌళి కెలమి.
వ. ఆసమయంబున బాణిద్వయోపేతుండు నేకవక్త్రింపు నగు నద్దనుజపుం
దరుం గనుంగొని స్కందుండు విస్మయమాన వదనారవిందుండగుచు ని
ట్లనియె. ౭౦
క. ఛిన్నంబులు మరల సము, త్పన్నంబులు నగునటంచు దద్దయు నళిద

రోషోన్నతి నుంటివి శాంతుఁడ!, కన్నారఁగ నస్మదాజ్ఞఁ గంటేమి పుడున్.

చ. అనుఁడు తదుక్తులున్ విని మహాసురితాత్ముఁడు దానవుండు ప
క్కున గను రోషమొప్పనవ ♦ లేప మిదేటికి రోరి నీమనం
బున నిలు మాజి నేక శిరముల్ భుజయుగ్మముతోడ నేనియున్
జెనకి భవన్మదంబణఁగ ♦ జేసెదఁ జూడుము నా ప్రతాపమున్. ౨౨

వ. అని మహారావ ముఖరిత హరిన్ముఖుండగుచు సింహముఖుండు షణ్ముఖుని
పై నొకనగంబు పెకలించివైచిన నతండొక్క బెడిసంపు టంపగోలన న
ది విదారించెనంత. ౨౩

క. శరములను సమరనైపుణి, యరయఁగ నీకున్ బ్రశస్త ♦ మన్యాయుధ సం
గరమున్ గరపలవడదని నిరసింపుచు దానవుండు నిష్ఠుర భంగిన్. ౨౪

క. రోషాగ్నికీల లడరఁగ, నా షణ్ముఖుమీఁద వైచె ♦ నత్యంతంబున్
భీషణమగు దండముగదు, ఘోషం బడరంగ సమర ♦ కుంభిని యందున్.

—♦ కుమారస్వామి సింహవక్త్రుని సంహరించుట ♦—

వ. అప్పు డప్పార్వతీ సుతుం డనేకకోటిమార్తాండ సదృశ తేజో విరాజితంబును
నతిభయదంబును నగు శక్త్యాయుధంబుఁ బరపిన జగంబులు నణంకం జే
యుచు మహారవంబడర వెడలి తదీయదండంబు ఖండంబులుగావించి యు
రోమండలంబు భేదించి నిమిషమాత్రంబున నద్దురాత్ముని ప్రాణంబులుగ్ర
సించి గంగాతోయంబులఁ గృతావగాహంబై మరలి పూర్వవిధంబునస్కం
దుని కరారవిందంబునఁ బొలుపొందె నంతయు. ౨౬

క. రుధిరములు నోటఁ దొరఁగగ, గుధరంబు తెలుంగువ్రాలి ♦ కుంభిని నానా
విధముల నటు నిటుఁ బొరలుచు, నిధనంబును బొందె వేగ ♦ నిశిచరుఁ డపుడున్.

వ. ఇట్లు విగతప్రాణుండైన యప్పాపాత్మునిం గని దివిజులు సంతుష్టాంతరంగు
లగుచుం బుష్పవృష్టి గురిసిరి. సమస్త భూతంబులును బ్రీభూత కోలాహల
సమేతంబులై చెలంగె నంత. ౨౭

శా. రాజద్వైభవుఁ డద్రిజాసుతుఁ డు వీ ♦ ర వ్రాతముల్ భూతముల్
జే జేలం గొలువంగ వాద్యరవముల్ ♦ చెన్నొంద మాణిక్య రే
ఖాజాంబూనద దీప్తిబంధుర మహా ♦ గారావళీ నిస్తుల

శాత్రిజత్స్నేహము హేమకూటపుర మెు • ప్పం జేరె నుత్సాహియై. ౭౯

వ. ఇట్లుం జేరి నిజమందిరద్వారంబున రథంబు డిగ్గి భూతవీరులను యథా స్థానంబుల కనిచి దివిజులతో నంతఃపురంబు ప్రవేశించి రత్నసింహాసనాసీనుండై యుండె నాసమయంబున నఖిలభూత గణంబులును గుహుని యనుమతి వడసి నిజస్థానంబులకుం జని సుఖం బుండిరి. తదాఖ్యానం బెవ్వండేనియుఁ బఠించిన వినిన నతండు సకలా భీష్టంబులం బొంది శత్రు విజయంబు గాంచుఁ బూర్వకాలంబున నగస్త్యుని వలన నిక్కథవినియకా దెవశరథాత్మజుండు సంగరాంగణంబున రావణాదులం జయించె నని చెప్పి సూతుండు మఱియు శౌనకాది మహామునులకు నిట్లనియె. ౮౦

—• శూరుఁడు యుద్ధమునకు వెడలుట. •—

క. అంతట శూరుఁడు దూతము, ఖాంతరమున సింహవక్త్రి • నంతిమదశ నత్యంతము విని బహుశోకా, క్రాంతత ధరఁబడియె గోపు• రంబునమండిక్.

తే. హరిచతుర్ముఖప్రముఖులో • నఖిలసురలు, నిజపదంబులఁబొందంగ • నేడుగలిగె మత్కృపికిధాన ఖేదంబు • మానిరకట, సనుజ! యీదృశావస్థరా • నగునె? నీకు.

వ. అని యనేక ప్రకారంబుల విలపించి కొండొక దడవున కసు రేంద్రుండు త్యక్తశోకుండై లేచి శీఘ్రంబ సింహాసనం బధిరోహించి యత్యంతకోప విస్ఫురిత లోచనుండై యిట్లనియె. ౮౩

తే. తనయ జాండంబులందలి • దనుజవరులు, సింహవక్త్రునికంటెవి • శేషముగను బలపరాక్రమధౌరేయు • లలఘుయశులు, గలరువారలరావించి • గరిమ మెఱయ.

వ. ఏను సంగరంబున కరిగి యబ్బాలుని జయించి క్రమ్మర మత్పురంబు సేరెద నని తలంచి సహస్రకోటులగు దూతల నఖిల బ్రహ్మాండంబులకు నియోగించిన, వారలాక్షణంబ చని తత్తద్బ్రహ్మాండ సంస్థితులైన దానవులకు శూరవచనంబు దెలిపి సత్వరంబుగా మగుడి వచ్చిరియ్యె జాండంబున కంత. ౮౫

మ. సకలాజాండములందు నుండు ఫలభు • క్సైన్యంబు లుదగ్రవిక్రో త్సుకతన్ నిర్జర భూరిఘోష మడరన్ • దోర్దర్పముల్ మీరవారక నేతెంచె హరోత్తమాంగతటిని • రంగత్తరంగ చ్ఛటాప్రకరంబుల్ వరతెంచు వైఖరిని శుం • భద్రత్నపేఢి (జూపట్టఁగన్. ౮౬

వ. వెండియుఁ బరమేశ్వరేచ్ఛాసంజాయమాన చరాచర జంతు సంతానాంత
ర్వ్యాపకజగజ్జాలంబునుం బోవ నజాండ బిలపథంబున వెడలి విసీల నిజ
తను తమః పటలంబు లాదిత్యాది ప్రంజంబు లాక్రమించి లోకంబులు గ
ప్ప జవనసముద్భవ పవన మహారవంబుల భువనంబులు వణంకఁ జరణో
ద్ధూత పరాగపరం పరల సప్తార్ణవంబులు శోషిల్ల పాదన్యాసవేగంబున బ్ర
హ్మాండంబు పరిస్ఫోటితంబుగా సైన్యంబులతోడం జనుదెంచి మహాబలుల
గు దనుజవీరులు భూనభోంతరాళంబు పాతాళంబు నిండి రప్పుడు. ౮౭

క. చరియింపఁగ నచ్చోటను, హరిశిఖిముఖసురలు తమకు • నవకాశము లే
కురుతర భరముం బొందిరి, గిరులుం బమురయ్యె బలము • గ్రిక్కిఱియుటచేన్.

క. దానవసేనాముఖమది, యానెన్ బ్రహ్మాండభిత్తి • నవకాశం బెం
తేని మొసంగక నాగత, దానవకోటులకు నపుడు • దగ్గిస్సూర్తిన్. ౮౯

వ. తదాగమనంబు విని శూరుండు పరమామోదంబున నంతఃపురంబున కరిగి
కృతస్నానుండై భోజనాదులం బరితుష్టిం బొంది త్రిపుండ్ర రుద్రాక్షమా
లికాలంకృతదేహుండును- దివ్యచందనమాల్య విభూషితుండును- దివ్యాంబ
రాభరణ శోభితుండును- మహేశ్వరదత్తపాశుపత బ్రహ్మాద్యనేక దివ్యా
స్త్రధరుండును నగుచు రణోద్యుక్తుండయ్యె నయ్యెడ. ౯౦

సీ. అపరీకృతాష్టకు • లాచలాయుత చక్ర, నేమికానిర్ఘోష • నిబిడభయద
మభ్రంకష సముద్య • దమితసింహధ్వజ, బహుళశస్త్రాస్త్రవి • భ్రాజమాన
మరుణప్రభాడంబ • రాంబరజిత్ప్రియ బింబ, దురుశాతకుంభకుం • భోజ్జ్వలంబు
సప్త సహస్రాశ్వ • శార్దూలవాహ్యకు, భూతపిశాచ సంఘాతబద్ధ

తే. మనలమానసతుల్యవేగాన్వితంబు, వీరయోగోద్భవము మహా • ఘోరతరము
నైన రథమును సింహవాహనము నొకటి, దెచ్చిరవ్వేళ తోడన • దితిజపతులు.

ఉ. అపుడు రథాగ్రభాగంబునకు • నదుద్రిలు ఘాల చలించె శీతల
దపనుఁడు గాంచె బొంకె తమానంబును బాడబవహ్ని యంతయున్
విపుల తరంగఘోషముల • నింతగలంగె పయోధు లేడు ది
గ్ద్విపములు కంపమొందె పృథివి • పీతల మల్లలనాడె సారెకున్. ౯౨

వ. అంత తదభిమానాఢ్యుండై దానవేంద్రుండు సకలదనుజకృతాశీర్వాదుండు
ను బటహభేరీకాహళాది మహారావ ముఖరిత హరిన్ముఖుండును ఘనఘను

వాసిసి ప్రశస్త హస్తారవింద వికీర్ణసుమబృంద శోభితుండును వందిమాగధ సందోహపఠిత బిరుదావళీ విభ్రాజమానుండును నగుచు రథచోదనంబున సారథుల నియోగించి మేరు సంగతంబగు నీలశైలంబు పోలుపునం జెలువొందుచు నిడుగెంపుకులు గొందఱు ఛత్రచామర ధ్వజపాణులును గొందఱు తాంబూలపేటికాపాణులును గొందఱు కళాచికాధరులును గొందఱు కనకభృంగారు ప్రశస్త హస్తులును నిఖలసముద్భట కోలాహలంబు లడరం బురవీథులు గోపురమంటపంబు లతిక్రమించి ప్రధానగోపురద్వారంబు సేరె నయ్యెడ. ౯౩

తే. కూడియున్నట్టి దానవకోటులెల్ల, దనుజకులసార్వభౌముని గనిరి పేర్మి
గిలకిలార్భటిఁ జేయుచు గేలనాయుధముల ధగధగద్దీప్తులు దరుచు మెఱయ.

వ. అంత శూరుండఖిల దనుజబలసమేతుండై గంధసిందురాల ఘటాగండనిష్యంద మానదాన ధారాపూరితంబగు పురపథంబు వెలువడి రణాంగణంబుఁ జేసె నప్పుడు. ౯౫

క. జనమునఁ జనికొందఱు దా, నవభటులా హేమకూట నగరము నద్య
ద్రివమొసఁగ నిరోధించిరి, వివిధాయుధపాణులగుచు విక్రమ మొప్పన్.

—॥ దేవతాప్రార్థన చేతఁ గుమారస్వామి యుద్ధమున కరుదెంచుట ॥—

వ. ఆసమయంబున మహాభయంకరాకారులగు సురవైరులం గని బ్రహ్మవిష్ణు ప్రముఖనిఖిలదివిజులును మూర్ఛిల్లిరి. వీరలును భూతంబులతోడ భయంపడి రంత బ్రహ్మాదులు గ్రౌంచాంకసేవనకుఁ దెప్పిరి లివహామహుండగు గుహుని చరణారవిందంబుల కెరఁగి యిట్లని విన్నవించిరి. ౯౭

క. దుర్వారమహిమశూరుఁడు, సర్వాండంబులవసించు సకలదితిజులన్
ఘూర్ణిహత గూడియుప్పుడు, గర్వమున వచ్చెఁ గంటె కదనంబునకున్. ౯౮

తే. అతని సేనాముఖంబడె యడ్డగించె, దేవ! తావకనగరంబు దృఢతరముగ
నమ్మహాపాపి దనుజుని నాజిఁ దునిమి, కరుణ బాలింపవమ్మమ్ము గ్రమధురీణ!

వ. అని యిట్లు విజ్ఞాపనంబొనర్చిన వారలవచనంబులు విని పరమకారుణికుండైన కార్తికేయుండు పవనుం బిలిచి రథంబాయత్తంబు గావించి తెమ్మని పనుప నతండట్లనం జేసె నంత పార్వతేయుండును సింహాసనంబు డిగ్గి. ౧౦౦

క. బహురత్నవిచిత్రితంబును, మహితజవోన్నతతురంగ • మణిబంధంబున్
మహనీయాంబకురథమున్, గుహుఁడధిరోహించి సమరకోవిదుఁ డగుచున్.

ఆ. చక్రదండముసల • శరశరాసనశూల, కులిశఖడ్గఖేట • కుంతపాశ
శక్తితోమరాది • సకలాయుధంబులు, గడుధరించి శౌర్య • గరిమ మెఱయ.

సీ. నవవీరులును మహో • న్నతలక్షవీరులు, విన తుంబురాంజిల్లి • వేడ్కఁ గొలువ
ద్విసహస్రవాహిను • లెసఁగంగ భూతంబు, లతులవిక్రమలీల • ననుగుదేర
బద్మగర్భాదిసు • పర్వులు నత్యంత • సంతుష్టిఁ బుష్పవ • ర్షములు గురియఁ
గల్పాంతఘనఘనా • ఘనఘోషమట్లును, బటహభేరీధ్వనుల్ • పరిఢవిల్ల
తే. చామరచ్ఛత్రకేతన • సముదయములు, వారిజారాక • కాంతిపంబులై వసుఁ జెలఁగ
వందికైవారముల్ మిం • గులను దడిలఁగఁ, గదనమండలికరుదెంచె • నుగ్రగౌం
చభేది. ౧౦౩

—• భూతంబులు రాక్షససేనలఁ జూచి భయపడి యుగుహస్వామిని జూచి ధైర్యము చెంది
యుద్ధమునకు సన్నద్ధు లగుట. •—

వ. అప్పు డఖిలభూతంబులు క్రూరకర్ములగు నమ్మహాదానవులం గని వెఱగు
పడి పరస్పరంబు భయంబునొందుచు నిట్లనిరి. ౧౦౪

క. కరములు శిరము లనేకము, లబరఁగఁ జూపట్టి భీక • రాకృతి నష్టో
త్తరసాహస్రాండంబులఁ, బరగు మహాదైత్యులిపుడు • పరతెంచిరొగిన్.

సీ. లోకంబు లన్ని పరి • శ్యేకంబు శాసింపఁ, జాలిననిరుపమ • సాహసాధ్య
లబ్జజాండంబులు • నలర విక్రమలీలఁ, గలిగింప నిపుణులౌ • కర్కశాత్మ
లంభోనిభులు వోలె • నలరారువక్త్రముల్, గలిగిన భీకరా • కారయుతులు
రవిచంద్రతారకా • గ్రహమార్గముల మించు, శిరములరాజిల్లు • పరుషతనులు
తే. చటులతరవహ్నిఘనశిఖా • చ్ఛటల ననయు, నేత్రములు గలిగ మెఱయు
నిర్నిద్రశౌర్యు
లహహ! వీరల నెదిరించి • యాహవమున, సాహసముఁ జూపనెవ్వఁడు • శక్తుఁ డగును.

వ. మఱియు భానుకోపతారకసింహముఖాగ్నిముఖవ్యాఘ్రముఖులును సుందో
పసుందులును మధుకైటభులును జలంధరమహిషాసురులును మొదలగువీరు
లందఱు మహాబల పరాక్రమ సంపన్నులును మహాక్రూరులును బ్రాహ్మీ
వైష్ణవైంద్రాగ్నేయాద్యాయుధ సమేతులును ననంతకోటి సంఖ్యాకసేనా

సహితులునునై యేరికిం జలసూపరాకుండఁ బ్రకాశింపుచున్న వారలుతో
ల్లి మనమిందఱ మొక్క బ్రహ్మాండంబునందుగల దానవులచేతఁ గోలుపో
యిన వారమగుటం జేసి యప్పపాత్ములమోఁల మనకుఁ బ్రాణ సంరక్ష
ణంబు సందియంబగు నద్దనుజసైనికులలోన నొక్కఁడొక్కండ మనసేనలం
గల బలుమగల నందఱం గెలువనోపునట్టి మహాబలుఁడైంద తేనియు ననేకబ
లంబులతోడం గూడికొని సమరంబునకు సమకట్టియుండశిలామహీరుహం
బులతోడఁ గయ్యంబు సేయుచు మనశక్తి వారిపై నెట్లుగెలువనేర్చు మహా ప్ర
చండగు వీరబాహుండేనియు నోర్వజాలండని త్రోచుచున్నయది. ఇంక సా
క్షాత్పర బ్రహ్మంబునగు బాహులేయుండు వీరల నందఱ జయింపసమర్థుం
డగుచుండుటం జేసి మనకుఁ బ్రోలఁగె ననుట కవకాశంబు లేమం గావున
దవానలంబు పముం బడు మిడుతలవడువునం బడి మడియవలయునని పరస్ప
రంబు నుడివికొనుచు భూతసైనికు లొకరొకరు ధైర్యంబులుం బుకికొనం
జేయుచు నిశాటసైన్యంబులపైఁ దలపడి రాసమయంబున. ౧౦౮

క. సేనాధిపులును వీరులు, దానవులం గనియు నపుడు ♦ తమభుజబల మెం
తేనియుఁ బరస్పరంబుం, బూనికి సంగ్రామమునకు ♦ భుజశౌర్యములన్.

వ. అప్పు డింద్రాదినిలింపులు గుంపులై మురవైరింగని యిట్లనిరి.

చ. అతిదురితాత్ములైన దను ♦ జాధిపులందర వీరినాజిలో
హతుల నొనర్ప కిట్లు దివ ♦ సావళిఁ బుచ్చె గుహుండ దేలకో!
దితిజవరుండు శూరుఁడనిఁ ♦ దెళ్లుట యెన్నఁడో! సర్వదేవతా
తతికివిమోచనంబెపుడో ♦ తాముసుఖించుట నింక నెన్నడో! ౧౧౦

వ. దేవా! నిజపదప్రాప్తి యెన్నండకో! యేమునాడలప్రాణంబులు గలిగి యేత
త్పర్వంబుఁ జూడగలమేయని దైన్యంబునం బలికిన విని హృషీకేశుండుసు
రల కిట్లనియె. ౧౧౧

—♦ విష్ణుమూర్తి కుమారస్వామి సామర్థ్యమును వర్ణించుట. ♦—

క. సాక్షాత్పరశివుఁడౌనిట, లాక్షుఁడు మన కెపుడు కర్త ♦ యధ్యక్షుఁడునై
రక్షించు గుహాకృతిచే, నీక్షణమున(జింతసేయ ♦ నేటికి మదిలోన్. ౧౧౨

మ. సకలాజాండములున్ జగంబులు విలా♦సంబొప్పగాఁ జూపె బా
లకుఁడై యెవ్వఁడు రోమజాలముల లీ ♦ లన్ బంచకృత్యంబులన్

బ్రకటించుఁగడు నెవ్వఁడు గుహునకీ ♦ ప్రత్యర్థిని గీర్వాణారి
బాకభారంబులా! దుఃఖించు సీతకుణముల ♦ బోరిద్యుతిన్ దైత్యులన్. ౧౧౩

క. సురలారమీరలివ్విభు, నిరుపమమహిమ పురచితిరో ♦ నీవుఁ దివిజే
శ్వర! చూడకు శిశుబుద్ధిని, శరజన్ము మహానుభావు ♦ జగదీశ్వరునిన్.

క. ఏతపము చేసినారొ, యీతండు మహానుభావుఁ ♦ డీశ్వరతనయుం
డేతాదృశశుభరూపస, మేతుండై మనకుఁ బ్రోవ ♦ నేతెంచెఁ గృపన్. ౧౧౪

క. నగిరైనఁ గినుకనైనన్, మిగులన్ సాహసమునైన ♦ మేదినిలోనం
జగడమున నైన శూరా, దిగఁబారఁగాన శక్తుఁడితఁడు ♦ దితిజుల నెల్లన్.

వ. ఇమ్మహామహుఁ డద్భుతంబగు బలం బెవ్వఁ డెఱుఁగ నోపు! ధృతాయుధం
బులగు భూతంబులును బలపరాక్రమ సంపన్నులగు వీరులును వినోదంబు
నం గూడికొని యిపుడు యుద్ధంబునకుఁ జనుదెంచి నిమిష మాత్రంబున
నసురుల నందఱ బరిమార్చి శూరపద్ముని సంహరింపం గలండు మద్వచ
నంబు సత్యంబని ముకుందుండు పలికినఁ బురందరాది బృందారకులు సం
దియంబు మాని డెందంబుల సకలశత్రుబృంద సంహారకుండును సత్యజ్ఞా
నందమయుండును నగు స్కందునిం దలంచుచుండి రాసమయంబున.

—♦ కుమారస్వామి యుద్ధస్థలమున కేగుట. ♦—

క. హరివిధులతోడ సత్వర, మరుదెంచి సమస్త దివిజు ♦ లాగుహు వెంటన్
బరమప్రేమను జనిరా, హరసూనుఁడు చూచి మంద ♦ హాసము మీరన్.

వ. సర్వగీర్వాణసమేతుండై వీరబాహుప్రముఖులతోడ గుహుండు దాయోధ
నస్థలంబుఁ జేరె నయ్యెడ. ౧౧౯

క. భూతంబులు రాత్రించర, వ్రాతంబులతో నొనర్చె ♦ రణమపుడు మహీ
జాతంబులు పర్వతసం, ఘాతంబులు గురియుచును బ్ర ♦ గల్భత మెఱయన్.

వ. ఇట్లు రణంబు బొనర్చిరంత. ౧౨౧

క. ఒకచో సేనానాయకు, లొకచో వీరులును దనుజ ♦ యూథులచే వా
రకపరిభవ మొందుచుఁ గడు, వికలత నాశాంతములకు ♦ వెసబఱచి రొగిన్.

ఆ. వీరబాహుఁ డపుడు ♦ వేగంబయున్నత, ధనువు బూని ప్రచుర ధైర్య మెసఁగ
బాణతతులు బరపి ♦ బహుదైత్యులను ద్రుంచి, మఱియు వారితోడ ♦ మహో
గ్రాహవంగ, ౧౨౩

వ. సమర్థుండుగాక పరాభవంబు నొంది గుహుని పాఱఁజేసె నప్పుడా దురాత్ములగు మహాఘోరదైత్యులనక్కుమారుఁజుట్టుకొని యుబ్బాలుండాలంబు సేయఁ జొత్తుండగునే! యని పచించుచు దండచక్రకులిశ శక్తిపాశతోమరాద్యాయుధంబులువర్షింపుచుఁ బెడబొబ్బలిడుచుఁ జొక్క మొగిముఱువఁ జొచ్చిన.

—• కుమారస్వామి దైత్యులతో యుద్ధము సేయుట. •—

మ. కని యాదైత్యులఁ గార్తికేయుఁడు మహా • గ్రంబైన రోషంబునన్
ధనువుల్ సజ్యముఁ జేసి భీషణముగాఁ • దత్పూర్జదంభోధర
స్వనముల్ పోలెను శింజినీరవము భా • స్వత్ప్రౌఢిఁ గావించెద
న్నినదంబుల్ వినిమూర్ఛనొందె దనుజా • నీకంబు గంపింపుచున్. ౧౨౫

వ. ఇట్లు మహామహుండైన గుహుండు దుర్వారంబుగా మౌర్వీనినాదంబు చేసి నిశిత శిలీముఖంబు లనేకంబులుం గురిపి రక్కసుల ముక్కులు జెక్కులును మూపులు వీపులును కాళ్లును వ్రేళ్లును శిరంబులును నురంబులును ఖండించి కొండలఁ జెండు నాఖండలు విధంబున భండన మండలంబున వఖండపరితాపంబు సూపుచు. ౧౨౬

సీ. వాలంబు లంఘ్రులు • వదనముల్ నుఱుమాడి, ఘోటకసంఘముల్ • గూల్చి గూల్చి
చక్రంబులునుధ్వజ • స్తంభముల్ జక్కాడి, స్యందనబృందంబు • చిదిపిచిదిపి
గండస్థలంబులు • శుండముల్ ఖండించి, శుండాలతండముల్ • చెండి చెండి
శస్త్రచామరములు • ఛత్రముల్ పొడిచేసి, రమ్యభూషణరాజి • రాల్చిరాల్చి

తే. ఘోరదైత్యుల శిరములు • గొట్టి కొట్టి, పెట్టుగరళోగ్రచుట్టలు • పెట్టి పెట్టి
గట్టురా పట్టిమద్దుల • పట్టి మూజి, విక్రమక్రీడఁ జూపట్టె • విస్మయముగ.

మ. ధరపాతాళము దిక్తటంబులు వియ • ద్భాగంబు స్వర్లోకమున్
హరిలోకంబును బ్రహ్మలోకమును బ్ర • హ్మాండోర్ధ్వ భాగంబు వి
స్ఫురణన్ నిండియు మాఱుమ్రోఁగెఁ బటుదో • శ్శుంభచ్ఛరాసారమున్
వఱిమార్చెన్ గ్రమమొప్ప సంగరకళా • పాండిత్యులన్ దైత్యులన్. ౧౨౭

తే. తాపసామరసంఘంబు • దక్క గుహుఁడు, దానవుల నెల్లనెల్లెడ • దర్పమణఁప
తచ్ఛిరంబులు గాహువు • స్తకపుపరిది, నీచరాచరమను జగం • బెల్లనిండె.

క. దితిసుతఖండితహస్త, స్థితములగు మహాయుధములు • శివతనయుశర

పరితర్షిత బ్రేరితముగుచును, హతముగఁ గావించెం బోర ◆ నసుర గణంబుల్.

వ. ఇట్లు నానాప్రకారంబుల దానవ గణంబులు హతంబులగుట ప్రత్యక్షంబు గనుంగొని హరిబ్రహ్మాదిదేవతలు వీరసేనాధిపులు సంతోష భరితాంతరంగులై రంత మఱియుఁ బూర్వంబట్ల వేరొండజాండంబుల నుండి చనుదెంచి నిండిన సకల వసుజులం గనుంగొని మున్ను వచ్చిన దానవులని వారలు భ్రమసియున్నంతలోన సద్దైత్యుల గుహుండు విగతప్రాణులఁ జేసె నట్టి యమ్మహానుభావునిం బరమామోదంబున సురగణంబులు సంస్తవంబులు చేసి రంతయు. ౧౩౧

క. దివిజారులెల్ల సంగర, భువిసిల్లిన నయ్యజాండ ◆ మున నాక్షణమం
దవకాశమలరి నిండెను, జవమునఁ జనుదెంచె నసుర సైన్యము మగుడన్.

వ. ఇట్లు నిండి పాపకర్ములైన ఘోరపక్షం జేరి కోలాహలంబులొనర్పుచు.

సీ. ధరణీమండలి నమ్మహాసురకటంబ ◆ శ్రేణిశిరస్సైంబాదముల్
గరిమతో మెట్టి తదీయకోటితో మహా ◆ కల్లోలియల్ దాటి స
త్వరతతో ఘోరభవవార్ధి నతం ◆ దర్పాంబణాగింతు మం
చు రహిం బన్ని ప్రతిజ్ఞ విక్రమములతో ◆ జూపట్టె నంతేనియున్. ౧౩౨

వ. సకలవైరిసంహారకుండగు హరకుమారుం గని యశ్వాలుండు రథగజతురంగంబు లేమియును లేక యొక్కరుండ బ్రహ్మాండాంతరాగతరక్షోవీరుల సమూహంబులం బరిమార్చె నని యతని సాహసంబున కాశ్చర్యంబునొందుచు నమ్మహామహుం జుట్టుకొని దనుజసైనికులు ఘోరాగమనంబునకు మున్నెయితని సంహరించెద మని వివిధశిఖాయుధంబులు వర్షించిరప్పుడు.

క. భూతగణంబులు వీర, వ్రాతము సేనాధిపతులు ◆ వారకచితా
భూతాశయులై రంతయు, నాతరి కరుణాసముద్రు ◆ డగుగుహుఁడెలమిన్.

వ. సారథియగు గంధవహుం గనుంగొని మందస్మితకలిత వదనారవిందుం డగుచు గంభీరవచనంబుల నిట్లనినె. ౧౩౩

క. అనిలా! నీవై పుణ్యం, జనితేర సాధారణముగ ◆ వరదము నాజిన్
ఘనమతి నడుపుము ముందట, వెనుకను బార్శ్వములనసురు ◆ వెనననల్లెడలన్.

వ. అని పలికిన నమ్మహారథికు వచనంబులు విని యనిలుండు భూనభంబులన దీర్ఘముద్రంబుల లోకాలోకంబుల సకలదిశలను దనసారథ్యకౌశలంబు మె

ఆయుధసంఘంబు నిర్భరంబుగాఁ బరపె నాసమయంబున సకలశాత్రవ వాజే యుంగగు నభ్యాహతిలేయుంత రక్కసుల మూకలపై నిశితవిశిఖ పరంపరలు పుంఖానుపుంఖంబులుగాఁ బరపిన నమ్మహాశరంబులుగాఁ బోడిమి సెసి రథంబుల దొరుగు రథికులును రథికులకు బాసటయై వచ్చి తద్బాణంబులు తనుత్రాణంబులు చ్చి పోయిన ప్రాణంబులను నిలుపరింపనోపక కరవాలంబులపై నొరుగు సాశ్వారులును సాశ్వారులకుఁ దోడుసూపుచుఁ బిడుగులువోని బెడిదంపు నారసంబుల తాకున నీరసంబులు దక్కి యుక్కడఁగి యొదలి పటుత్వంబు సాలక మొల్లంబు సెసి మొల్లంబోవుచు నెత్తురులుగ్రాత్తుల ప్రదమింబస రాహుత్తులును రాహుత్తులకు సహాయంబుగా మొత్తంబులై చనుదెంచి పరుషతర శిలీముఖంబుల ఘట్టనలకు నెట్టన నిలువలేక సొమ్మసిలి నేలం గూలు కాల్బలంబులును మఱియు నమ్మహామహుని నాత సాయకంబులఁ దుండంబులు ఖండితంబులైన బిరబిరం దిరిగి ధరం దిరుగు వేదండంబులును ముందలి పదంబులుం దెగిన మొడలు బెడమరిలి మొగ్గరిలంబడు నశ్వంబులును ఘోరనారాచంబుల చేత సారథులతోడ నుగ్గునూచంబులగు శకటంబులును నై దనుజబలంబులు వేరుపరచి పరవియెండఁ బోయిన నెటుసొచ్చినఁ దద్బలంబుల పెల్లు దప్పించుకొను వెరవుసాలక నెందెందునుం దనుజయోధులును నాయోధనంబున హతులైరయ్యవసరంబున పిసరిన రుధిర జలంబులును విగళిత ధవళాతపత్ర ఫేనంబులును విస్రస్త శిరోజాత శైవాలంబులును వికీర్ణపతాకమీనంబులును విదారితహయ కబంధ మకరంబులును విఖండిత శిరః కమఠంబులును విచ్ఛిన్న వేదండ గండశైలంబులును గలిగి రణాంగణంబు సముద్రంబు పోలుపు సంపాదించె నట్టియెడ. ౧౩౯

క. మృతిదైత్యసైన్యభరమున, క్షితితలమెల్లను జలించె శేషుని తోడన్
గుతుకమున సారమేయ, వ్రతతియు ఖేచరులు కుణపపంక్తులు మెసవెన్.

తే. ఉనుపభాస్కరబింబముల్ గడగ్రసించు, రాహువులవోలె నెంతయు మహి నెలంగె
ఘోరయుక్తంబులై వ్యోమవాటి నుజ్జ్వకరము లెంలయు బహుభయంకరత
ము లగుచు. ౧౪౦

వ. మఱియు దైత్యరథాకర్షణయంత్రితంబులై మహాఘోరంబులగు భూతప్రే
తపిశాచంబులు మాంసభక్షణాపేక్షం బ్రవర్తిల్లె నెంతయు. ౧౪౨

తే. అఖిలజగములు వ్యాపించె నస్త్రభయము, నస్త్రవేగంబు కంపించె నతిశ
యముగఁ
చటులరయంబున బవనుండు పరవశత్వము, దరమె గుహలు విక్రియం జెన్ ధర
ణిలోన. ౧౪౩

వ. ఇట్లు తదస్త్రవేగంబును శరాసనపాటవంబును సారథ్యకౌశలంబును గనుం
గొని యిది మహామహుండగు విగ్రహుని సామర్థ్యంబో! లేక శస్త్రాస్త్రమ
హిమంబో! యని బ్రహ్మవిష్ణులును వియచ్చరులచ్చెరువందిరెంతయు. ౧౪౪

క. ఈకరణిగుహుండు దైత్య, నీకముఁ బరిమార్చెఁ గుణపనివహము రుధిరా
స్రోతఃప్రవాహములు భూ, లోకంబును మఱియు సురగలోకము నిండెన్.

వ. ఇట్లనేకకోటిసంఖ్యాకులును మహాభయంకరాకారులును నగు దనుజవీరు
లు హతులగుచుండ నవ్వేళ మఱియు వేరొండు బ్రహ్మాండంబులనుండియు
మగుడ పూర్వంబట్ల సర్వాయుధపాణులును సమరాంగణభయంకరులును న
గు నసురు లరుదెంచిన వారల నాక్షణంబ గుహుండు రోషభీషణుండై బ
రిమార్చె నప్పుడు. ౧౪౬

క. ఈరీతిమాటిమాటికి, నారాక్షసు లరుగుదేర నాజిన్ మునివే
మారుకుమారుఁ డజాండ, ద్వారంబును గప్పె విశిఖతతులన్ గినుకన్.

వ. అంత మార్గాభావంబగుటం జేసి నిశాటవర్గంబు నిర్గమింపక నిలిచెనజాం
డభిత్తిపర్యంతంబు గతప్రాణులగు నసురుల కుణపంబులు పర్వతంబులట్ల
తదీయ రక్తంబు లర్ణవంబులుం బోలెఁ జూపట్టె నెంతయు. ౧౪౮

తే. కుణపశైలంబులను జూచి కొమరుసామి, మందహాసంబు సెలువొంద మ
హిమ మెఱయ.
ద్వాదశస్పృగగ్నికీలల వానినెల్ల, భస్మములు సేసె దుర్వారపటిమ మీర.

వ. అంతఁ బూర్వప్రకారంబున నవకాశం బేర్పడం గలిగె నప్పుడు హరిబ్రహ్మా
ది సకలదేవతానికరంబులు సర్వసుపర్వాగ్రగణ్యుండగు సుబ్రహ్మణ్య
మహామహిమకు నానందించి రుధిరార్ణవపరిప్లుతంబుగా నద్దురాత్ముల వ
ధించి నేత్రానలంబున భస్మీభూతంబులం జేసె నింక నిమ్మహామహున

ను శూరపద్మసంహారంబేమి భారంబని పరస్పరంబు నుడివికొనుచుఁ బ్రి
యమిల్లి స్తుతిశతంబు లొనర్చి రంత. ౧౫౦

—: కుమారశూరపద్ముల యుద్ధము. :—

తే. శూరపద్మాఁడు కోపవిస్ఫురణ మెఱయ, శివకుమారుని నెదిరి భక్తిం జెలంగ
నద్దురాత్మని చటులతర రాగ్రహంబు, గడలుకొనఁగ నెదిర్చె శ్రీకరసుతుఁడు.

వ. అంత దైత్యవల్లభుండగు శూరుండు గుహున కిట్లనియె. ౧౫౨

క. పరమేశ్వరుఁడగు శంకరు, పరమహిమ మదనకు నెపుడ వధ్యత దనసర్ప
ణరులెవ్వరేని నాతో, దురమొనరించినను బొందు దురుపరిభవముల్.

వ. అనిన విని కుమారుండు గంభీరవచనంబుల శూరున కిట్లనియె. ౧౫౪

క. పాపివి నీతోనే నేలా! పలుకఁగ గరుణ మత్కళంబును త్రావ్వి
నాపహతిఁ జేయకుండుటఁ, జూపల్మరు గర్వమహిమ సూపెద నిటులన్.

వ. ఇప్పు డస్మద్బల పరాక్రమంబులు సూడుమని పలికినఁ బాపాత్ముండగు
దానవుండు కోపంబు దీపింప నున్నతంబగు శరాసనంబుం గొని గొనయం
బెక్కించి యుక్కసంగ పిడుగులు వోసె బెడిదంపుటంపములు గుహునిసై
న్యంబులపైఁ బరపె నప్పుడు. ౧౫౬

క. సేనాపతులును వీరులు, నానాభూతములతోడ నారాచంబుల్
దానవుపై నొక్క మొగిన, నూనప్రౌఢిమను గురిసి యున్నత పటిమన్. ౧౫౭

క. శూరవిముక్తశరంబులు, వారించి తదీయ బాణ వర్షంబుగడున్
ఘోరతరంబుగఁ దాకెను, వీరవ్రాతంబు భూతవితతిన్ వరుసన్. ౧౫౮

వ. అప్పుడు కొందఱు విదారిత సకలావయవులునై పలాయనంబు నొందిరి.
కొందఱు మూర్ఛాగతులై పడి రంతయు. ౧౫౯

ఆ. వీరబాహుముఖ్య వీరులు గొందఱు, ఘోరబాణతతులు గూరిసిరపుకు
రాక్షసాధినాథు వక్షస్థలంబును, దాకియవియుఁ గుంఠితంబులయ్యె. ౧౬౦

క. భూరితర బాహుబలుఁడగు, శూరుఁడు కోపమునఁ బరపెఁ గుంభచ్ఛరముల్
వీరులు మర్త్యయును బరిపిన, దారుణశరములను దునిమెఁ దద్దయుఁ గడిమిన్.

వ. ఇట్లు దునిమి మఱియు ననేక శిలీముఖంబులుఁ దదస్త్రంబులు ధనువులును విద
ళితంబులు గావించి బాహువినిర్ముక్తంబుల పరస్పర శిలీముఖంబులం

జూపిన మహాభీలంబుగాఁ గోలాహలంబు లొనర్చుచు నలుగడలను దిరు
గుచు వీరవరుల భర్జించె నప్పుడు. ౧౬౨

తే. రక్తధారాప్లుతాంగులై రణమునందు, విగళితాంబరులగుచు నవ్వీరులెల్ల
వెరచిపఱచిరి దెసలకు వీరబాహుఁ, డవియుఁ గనుఁగొని బహు కోపమును
డర మదిని. ౧౬౩

వ. ఎదిరించి రాక్షసుని రథంబును శరాసనంబునుం గరవాలంబున ఖండించె
నప్పుడు. ౧౬౪

క. పరిసరగతుఁడగు వీరుఁ, సురవైరియు ముష్టి మడర శుంభత్ప్రటిమన్
గరతాడనమున నెనసిన, ధరణింబడి మూర్ఛనొందెఁ బసద్ధమున నతఁడున్.

వ. అంత శూరుండు దూతహననంబు శూరులకు యుక్తంబుగాదని యాతని ప
దంబులు గేలం గీలించి గగనతలంబున కెగయవైచిన నతండా కాశపదం
బున నుండి నిమిషమాత్రంబున విగతమోహుండై గుహాంతరంబు సేరె
నంత.
౧౬౬

మ. ఉరుశౌర్యాఢ్యుఁడు సురారివల్లభుఁడు మహోత్కర్షముల్ మీఱఁగా
గిరిమున్ గాంచ గిరీంద్రసన్నిభము సంగ్రామంబైన కోదండమున్
బరగన్ బూని మహాభయంకరముగా భాస్వద్గుణారావముల్
విరచించెన్ గగనావనీతలములున్ వేమారు గంపింపఁగన్. ౧౬౭

వ. అంత గుహాంతమున నున్న హరిబ్రహ్మాదిసంహరణసమర్థంబున బ్రహ్మాం
డపర్యంత పరివర్ధమానంబగు కైలాసంబు కంటె మహోన్నతంబగు నొ
క్క బాణాసనంబు గొని సజ్యంబు గావించి యనంతకోటి వజ్రభీలరవం
బులం బోని మహారవంబు లడర గుణాస్ఫాలనంబుఁ జేసె నెంతయు. ౧౬౮

ఆ. అంత శూరపద్మదంతకాకారుఁడై, కోపవహ్ని శిఖలు ఘూర్ణిలంగ
బ్రళయకాలమేఘపటలంబు విధమున, భయదరవమొనర్చె భటుతరముగ

వ. పవనునిం బోలె నత్యంతజవములు నగ్నికరణి దాహకంబులు నంతకుం బగి
ది మహాసంహారకంబులు మేరుప్రముఖ విదారకంబులు బ్రహ్మాండభేదకం
బులును క్ష్వేళజ్వాలాభీలంబులును సకలజగత్క్షోభకంబులు నగు శరంబులు
కోటి దశకోటి శతకోట్యర్బుదంబులుగా వర్షించిన దేవగణంబులు భయ

భావింతురై సత్వరంబుగాఁ జని కరుణాపరిపూర్ణుఁడగు విష్ణుదేవునిం జేరి శూ
రశరాసార పీడితులమగు మాకు నిలువ శరణం బెద్దియని ప్రార్థించిన హ
రియు సురలకు నుత్తరం బిచ్చు నంతలోన. ౧౭౦

క. శరజన్మునియస్త్రావళు, లురుతరగతిఁ దచ్ఛరంబు • లొగిఖండించెన్.
సురలదియుంగనుఁగొనిభా, సురముగ హర్షించిరెలమి • సుముఖత దనరన్,

క. శూరుండు మఱియునంబక, వారంబులు గుహునిమీఁద • వర్షించెఁ గసున్
ధీరతనతఁడవి యన్నియు, వారకచూర్ణములుచేసె • వర శౌర్యమునన్.

వ. మఱియు నేఁడు నూఱు బాణంబులు దానవునిపై నిగుడించిన నతండు తద్బ
లంబు లెల్ల సఫలంబులైనను విఫలంబులు గావించి ద్విసహస్రవిశిఖంబు
ల నాగుహుని పయిం బరపిన. ౧౭౩

క. ద్విసహస్ర శిలీముఖముల, నసదృశగతిఁ దచ్ఛరముల • నణచి నిశాత
ద్విసహస్రశరంబుల మఱి, యసురవరుంబరసెగుహుఁడు • దగ స్ఫూర్తిన్.

వ. నిశాచరేంద్రుం డును దోడనద్విసహస్ర మహాశిలీముఖంబులఁ దదీయ నా
రాచంబులు ఖండించి శేషఫణి సహితంబుగా నశేష భూమండలంబు గ్ర
క్కదల సింహనాదంబొనర్చుచు ననంతకోటి సంఖ్యాకంబులగు శరానీకం
బులు వర్షించిన షణ్ముఖుం డవియన్నియు నడుమనం దునిమివైచె నిట్లన
య్యిరువురు పరస్పర శరవిదారితంబుగాఁ బోరి రెంతయు. ౧౭౪

మ. అపుడన్యోన్యమహాస్త్ర ఘట్టనసము • ద్యద్వహ్ని కీలంబు ల
భ్రపదంబంటె వియన్నదీముఖసరి • త్ప్రాధోధుల్ శోషిలన్
విపులస్థేముల వారి బాహుబలముల్ • వీక్షించియప్పౌరల
క్ష్మపురస్సీమవసించె నెవ్వనినజూ • చేష్టుదంచున్ గసున్. ౧౭౫

వ. అప్పుడు వారిగాత్రంబులు శరవిద్ధంబులై నేత్రగోచరంబులు గాకుండెనంత
శూరపద్ముఁడు మహాసాహసంబున నమ్మహారథికు రథధ్వజంబులుభగ్నం
బులుగావించి సింహనాదంబు లడరశంఖంబు పూరింపుచు మఱియును.

క. అతిఘోరములౌ శరములు, దితిసుతపుంగవుఁడు గురిసె • ధీరతనగజా
సుతుఁడును దన్నారాచ,వ్రతతులుదునుమాడెభుజప • రాక్రమముప్పన్.

వ. వెండియు గుహుండు నిశితంబులగు సప్తవిశిఖంబులు సంధించి యుద్దాన
వేంద్రుని రథకేతనంబునుం దునిమి సముద్రంబునం బడవైచె నంత.

తే. భూతగణములలోనంచి భూరిబలుఁడు, భానుకంపాఖ్యుఁ డరుదెంచి భవుని మహిమ
వేయిముఖముల శంఖముల్ వేయునొత్తె, భూరిఘోషంబునిండార భూనభముల. ౧౭౯

వ. అమ్మహారావంబు బ్రహ్మాండభిత్తి పరిధ్వనులీచుచు సర్వాశ్రోత్రంబుల నాక్రమించుచు ననేకయుగపర్యంతం బెడ తెగక మ్రోసె నప్పుడు హరియు సంతోషంబునం బొదలుచుఁ బాంచజన్యంబు పూరించె నంతయు. ౧౮౦

క. అమరగణప్రార్థితుఁడై, యమరగడహనుండుకుక్కు టాకృతి యగుచున్
గొమరొప్పఁ గొమరుసామికి, సుమహితరథకేతనమున జూవట్టైగఁనున్.

వ. ఇట్లనలుండు తామ్రచూడుఁడై పరిశయు ఘనాఘనంబువోలె మహాధ్వానిం జేసె నప్పుడు హరిబ్రహ్మాదిసకల దివిజగణంబులు సంతుష్టమనస్కులగుచుఁ గోలాహలంబు లొనర్చి రాసమయంబున. ౧౮౧

తే. అమ్మహాధ్వని యాలించి యసురవాత్మ్యుఁ, డసురనాథుఁడు మత్స్యృష్టి యందు నుండు
నిర్జరాఘంబుదనమ్రోలినిలచియిట్లు, చటులకోలాహలంబులు సలుపనగునె!

వ. ఇప్పు డీవేల్పుమూకల యేపణంచి బాలు నాలంబున దూలించెదం గాక యని పరితిన భిన్న రథస్థుండై నభస్థలగతుండగుచు దేవతల నుద్దేశించి కోపంబున శరవర్షంబు పుంఖానుపుంఖంబుగా వర్షించె నట్టియెడ. ౧౮౪

క. విశిఖంబులవియుతోడనె, విశకలితంబులుగఁ జేసి విధివిధి! నా
శశిధర సూనుండరదమ, కుశలతతోఁ బరపైద్యైకుంజరు మీఁదన్,

వ. ఇట్లు నభంబునకుం జని మహామహులండైన గుహుండు దేవతల కథయంబు లోపంగి కొండొకదూరంబున వారలనునిచిన వారును గుహాహవంబునఁ దదనుజ్ఞ నట్లన యుండి రెంతయు, ౧౮౬

క. మ్రోలనశూరుఁడుగుహుఁగని, శైలింప గణంబు బాఱె నానాదిశలన్
బాలిశుఁడనిలిచెనెపుటన, హాలెన్నన్యోన్ మదీయ మగఁబలుమచటన్, ౧౮౭

వ. అనిచింతించి నిర్జరారి దారుణంబులగు నారాచంబులు నిగుడించినం గుమారుండు పరిత్యస్త్రంబుల నవియుం దుముకుచేసె నిట్లు నవ్విరు లిరువురు నస్త్రధంబులు పవనజవంబునఁ గులాలచక్రంబు కరణిం బాసినచక్రంబు పోల్కి

క. అమితపరాక్రమధుర్యుం, డమరచమూవల్లభుఁడు తద్దలజకచయముల్
తుమురుగఁ జేసె సహస్రా, స్త్రముల నతనివిల్లు దునిమెఁ దారుణభంగిన్.

క. దనుజవరేణ్యుం డప్పుడు, ధనువున్ వేరొకటి పూనిఁ దారథముపయిన్
జనియాకసమున నెలకొని, సునిశిత బాణములు నేసె సుబ్రహ్మణ్యున్.

వ. అప్పుడగ్గుహుం డంబరంబునకుఁ దోడనఁజని యతనితోడం దలఁపడియె నంత నసురుండు గయ్యంబు సేయు వాఁడ వోలె నంకుండి మగుడ మాయావియై యద్దేవసేనావిభుఁ వంచించి నిమిషంబులోన మహీ తలంబున కరుదెంచె నప్పుడు. ౧౯౯

క. శరజన్ముం డసురుతోడనె, ధరణీతలమునకు వచ్చి దానవుతోఁ భా
సురశౌర్యోన్నతిఁ బోరెను, దురితాత్ముం డసురుఁ డంతఁ దుర్దాంతగతిన్.

వ. పాతాళంబును బాథోధియుఁ జక్రవాళంబును మేరునగంబును దిక్పాలకనగరంబులును బ్రహ్మవిష్ణులోకంబులును మాయావియై గ్రమంబునఁ గ్రమ్మరిన. ౨౦౧

క. అందందు నరయుచుఁ జని, యిందుకళాధరతనూజుఁ డెలమి విజయముం
బొందఁగ నిశిచరుతోడన, మందపరాక్రమము నెసఁగ మార్కొని పోరెన్.

ఆ. అండభిత్తి వ్రచ్చి యసురుండు మఱియును, విశిఖవృష్టిఁ గురిసె విక్రమమున
నచటఁ గార్తికేయుఁ డరుదెంచి శివసూనుఁ, డతని రథము గూల్చె నంబకముల.

వ. అంత వేరొండు రథం బెక్కి శూరపద్ముం డనంత శిలీముఖంబుల బ్రహ్మాండ బిల విదారకంబులైన శరజన్ముని శరనిసరంబులు దునుమాడి పూర్వంబట్ల మార్గంబు సంగిన నజాండాంతరంబులనుండి దనుజవ్రజంబులు మొత్తంబులుగా గంతులు వేయుచు నరుదేరం జూచి బ్రహ్మాది దేవత లాత్మగతంబున. ౨౦౪

క. హాలాహలపుంజంబో, కోలాహలమడరవచ్చు కులిశవ్రజమో
కాలాగ్నిధూమతతియో, యాలోకింపగ నిదేమి యద్భుతమొకో. ౨౦౫

వ. వెండియు బ్రహ్మాండ కటాహబహిర్జల ప్రవాహంబులో యని మనంబున వితర్కించి భయభ్రాంతులై హరిబ్రహ్మాది నిఖిలసురలు దిగంతంబులకుం బరచు నంతలోన నద్దైత్యభటులు పరాక్రమోద్భటులగుచు నత్తారకారిం జుట్టుకొని కట్టలుక బెట్టిదంబులగు శరంబులు గురిసిన. ౨౦౬

క. చండసన్మిత మొలకగ నుర, బృందాధీశుఁడు గుహుండు భీషణపటిమన్
బృందారక పరిపంథుల, నందఱ గోపాగ్నిశిఖల నవ్వుచు దహించెన్.

వ. ఇట్లు పలుమఱు నరుగుదెంచు నిశాచరబలంబులఁ గోపవీక్షాగ్ని శిఖలం ద
హించియుఁ జలంబుడుగక మఱియు గుహుండు చక్రదండముసలపరశు క
రవాలంబులు గొని సకలాజాండంబులం గల మహాబలులగు దైత్యుల మ
దాజ్ఞ సాధించునని పంచాయుధంబులుం బరపిన నవియు ననంత కోటి మా
ర్తాండ తేజోవిరాజమానంబులును మహారావఘోరంబులునగు నజాండచం
బులు సొచ్చి నచ్చోటనుండు రాక్షసతతుల హతంబు గావించె నట్లు సకలంబ
ని సూరుండు మనంబునం గనలుచు సర్వసంహారకంబును సకలచక్రాధి
దైవతంబగు చక్రంబు నిర్వక్రపరాక్రమ ధారేయుండగు నబ్బాహులేయు
పయింబరపిన. ౨౦౮

క. శరసంభవుఁడా చక్రము, వరగర్భస్త్రై సాక్షిఁ గొనియెఁ బ్రత్యస్త్ర గో
చరముగఁ టదీనిదనుజే, శ్వరుడుం బరితాపమొంది వారని కినుకన్. ౨౦౯

వ. మాయాపాయఁ బెనునేక రూపంబులు ధరియించి యుద్ధ రాక్షసుండు వహ్నిసం
భవుతోడ బవరంబు సేయ సమకట్టిన. ౨౧౦

క. నానారూపయుతుండగు, వానిం గని నగుచు దివిజపతి యేతు వేగన్
జ్ఞానాస్త్రంబు నిగుడ్చిన, దానన్ గతమాయుఁడగుచు దానవుఁ డలుకన్.

వ. ఒక్కండ నిలిచె నంత హరిబ్రహ్మాదిసకలనిలింపులు హర్షోత్కర్షంబునం బు
ష్పవర్షంబులుం గురియుచుఁ గలకలధ్వనులం జెలంగి రయ్యవసరమున.

క. సూరుండజాండమవ్వలఁ, జేరి రణోద్యోగి యగుచుఁ జేరెను గుహునిన్
ధీరుఁడు సేనానియు దో, స్సారత రాక్షసు నెదిర్చి శౌర్యంబెసగన్.

వ. ఇట్లు గుహుండు నజాండాంతరంబునకుం జని దనుజేంద్రుతోఁ ఘోరఘో
రంబుగా సలిపె మఱియు నందుండి వేరొండు బ్రహ్మాండంబున కరిగియం
దు నమ్మహాభుజు లిరువురు ననన్యాదృశంబగు జన్యం బన్యోన్యంబొనరించి
రంతయు. ౨౧౪

— బ్రహ్మాండాంతరంబులసంగ్రామము మొనర్చు కుమారస్వామిని గూర్చి దేవతలు దిగులొందుట —

క. ఈరీతి నబ్జజాండము, లారూఢిగ సొచ్చి కడిమి నయ్యసురుం గూ
ల్చోరగ నది గని భయమున, వారిజగర్భాదివిబుధ వర్గంబెల్లన్. ౨౧౫

వ. హరిం గని యిట్లనిరి. ౨౧౬

క. గరుడధ్వజ! శూరుం డితఁ, డరయఁగ మాయావి దుష్టుఁ ♦ డతి సంచకుఁడై
సురవిభు సుబ్రహ్మణ్యుని, దురమునకుం బిలిచె మిగుల ♦ దోర్గర్వముచేన్.

— ♦ విష్ణువు దేవతలకు ధైర్యము చెప్పుట. ♦ —

వ. తద్వచనంబులు విని దేవదేవుండైన గుహుండు సజాండాంతరంబునకుం
జనియె పాపకర్ముం డతివంచకుండు నగు నద్దైత్యు గనుంగొనియెనో, లే
దో, కని దురంబొనర్చునెడ జయంబెవ్వం డలుగునో యెఱుంగము మనం
బున సందియంబు మహాభయంబయ్యెడు నని పలికిన. ౨౧౯

క. వారలవచనము విని మధు,వైరియుఁ దలపోసి గుహుని వైభవ మహిమన్
భూరికుతూహల యుతుఁడై, సారసుధాఫణితిఁ బలికె ♦ సవభుక్తతతిన్.

క. సురలార! వినుఁడు సాత్త్వ, త్వరశివుఁడా షణ్ముఖుండు ♦ తథ్యం బజయన్
శరవిద్యావైపుణిచేఁ, బఱగు మహాబలుఁ డతండు ♦ ప్రౌఢిగ దలిర్పన్. ౨౨౦

ఆ. దేవవిభుని మహిమ ♦ దెలిసియుండియు మీరు, సందియంబు దేల ♦ ఖండములను
నిఖిలపద్మజాండ ♦ నివహముల్ గుప్పించి, వచ్చు సత్వరముగ ♦ వగవనేల?.

వ. అని యిట్లు హరి డిలం బలికిన హరివచనంబులు విని సురలు ముదంబునం బొ
దలి రంత శూరకట్నంబు సకలాండంబు మహాఘోరంబగు సంగరం బొ
నర్చి మగుడి నిజపురి సమీపంబుఁ జేరి కార్తికేయునిం గయ్యంబునకుం
బిల్చిన. ౨౨౨

క. శిరమహేంద్రపురంబును, జేరి గుహుం డంతఁ దనుజ ♦ సింహునితో డన్
భూరికదలఁ దలచెనప్పుడు, దారభుజావిస్ఫురత్ప్ర ♦ తాపప్రౌఢిన్. ౨౨౩

వ. ఇట్లు దలపడినం గనుంగొని దనుజసైనికులు రోషావేశంబుల బాణవర్షం
బులు గురియుచు నొక్కపెట్టం గుహునిం జుట్టుకొనిన. ౨౨౪

క. మందస్మితముఖుఁడై గుహుఁ, డందఱ జగటార్చె నాజి ♦ నాశుగమంచున్.
వందకధరముఖ్యామర, బృందంబవ్వేళఁ గురిసె ♦ విరులుం వేడ్కన్. ౨౨౫

వ. అంత శూరుండు హతులైన నిజసైనికులను సైన్యంబులతోడ సమీపగతుం
డగు షణ్ముఖునిం గని శోకాకులుండై నీదు కేమి చేయఁగలవాఁ డన నిట్లొం
డెడ వు చింతించి. ౨౨౬

—♦ శూరుఁడు దుఃఖితుఁడై తల్లిని స్మరించి యామెతో విచారించుట. ♦—

క. తనజనయిత్రినిమాయను, ననవధికతపోగరిష్ఠ ♦ నాతఁడుమందర్
మనమునఁదలంపనదియున్, దనయునికడ కరుగుదెంచె ♦ దాత్పర్యమునన్.

వ. ఇట్లరుగుదెంచినఁ దల్లిం గని కూర్మి కుమారుఁడగు శూరుండు పాదంబుల కె
రఁగి హతులగు సిద్దనుజుల మరల బ్రతికింపుమని ప్రార్థించిన నమ్మాయ త
నూజున కిట్లనియె. ౨౨౯

—♦ మాయ శూరునికి రాక్షసుల బ్రదికించు నుపాయము చెప్పుట. ♦—

తే. కార్తికేయుండు దలఁపసా ♦ క్షాన్మహేశుఁ, డతనినిందింప వచ్చునే ♦ యతఁ డుగాక
నస్మదుక్తులువినకెంత;యతనితోడఁ, గయ్యమునకుఁదొడంగితి ♦ గర్వమునను.

వ. అది గావున నిన్నితండు శక్తిచేత సంహరింపం గలండది యట్లుండ నిమ్మ
హితులైన దైత్యుల బ్రతికింపవలయు నేని సముద్రంబులోన సుధామయం
బగు మందరాచలంబు గలదు. దానిం గొని తెచ్చిన తద్వాయుసంస్పర్శనము
న నిమిషమాత్రంబులోన మృతులెల్ల సజీవితు లగుదురని చెప్పి యమ్మా
య చనియె నంత. ౨౩౦

—♦ శూరుఁడు మందరాచలంబు దెప్పించి సింహవక్త్రాది దనుజుల నెల్లర బ్రదికించుట ♦—

క. శూరుఁడు తద్వచనము విని, భూరికుతూహలము దనర ♦ బోరన్నతమాకం
క్రవవాహనముఖ్యయు, దాంత సురలోకరక్షము ♦ తాఁగని పలికెన్.

వ. నీవు సత్వరంబుగా సాగరంబునకుం జని సుధామందర నగంబుఁ గొని తె
మ్మనవుడు నదియు నట్లన చని యప్పర్వతంబు శీఘ్రంబ తెచ్చిన నయ్య
వసరంబున శూరుపుత్రులగు భానుకోపప్రముఖులును దత్సోదరులగు సిం
హవక్త్రాదులును మఱియుం దక్కిన రక్కసులును దత్పవనంబు సోకిన మా
త్రంబున నిద్రమేల్కాంచునట్లు లేచి యిదియేమి యుద్ధస్థలంబువలె నున్నద
ని పలుకుచు ఘోరంబుగా గోలాహలంబు లొనర్చుచు. ౨౩౧

క. పరిసరపతితాయుధములు, కరముల సంధించి వేగ ♦ గయ్యంబునకున్
దొరకొను నాత్మీయులఁ గని, పరమాహ్లాదమున శూర ♦ పద్ముండుపుడున్.

వ. ఇంద్రలోకరక్షంబు గనుంగొని బహూకరించి నిఖిలదనుజుల నిందించిన న

దియు దూరంబునం గని మహాభయాన్వితులై యింక వీరి బాధ తప్పేనేని యది రేపు మనకుఁ బడప్రాప్తి యని పలికి తమతమ యాయుధంబులు విడిచిని జపదంబుల నిరాశులై కొందఱు చక్రినాకహాపంబులును మయూరాకృతులును గొందఱు హంసపారావతశుకపికాద్యాకారంబులు ధరియించి దిగంతంబులకుం బఱచి రాసమయంబున వీరులుభూతసేనలు సేనాధిపతులును నడలుచు నత్యంతచింతాసాగరంబున మునింగి రంతయు. ౧౩౪

—◆ శూరునానాతిదనజులు కుమారునితో నెదిరించుట ◆—

చ. అది యఖిలంబు సూచి దర ◆ హాసవిభాసుర వక్త్రపద్ముఁడై
సదయుఁడు కార్తికేయుఁ డరు ◆ శౌర్యధురీణుఁడు నిల్చె సచ్చటన్
బదపడి శూరునాజ్ఞ బహుపాప్లు సింహముఖాదిశూరులున్
గదసిరి మణ్మ్మఖున్ శలభ ◆ కాండము చిచ్చునబోలె నుద్ధతిన్.

వ. ఇట్లు గవిసియద్దురాత్ములు పశితవిశిఖంబులు గుహునిపయిం గురిసి రప్పుడు.

—◆ కుమారస్వామి పాశుపతమున దనుజుల సంహరించుట ◆—

తే. వారియాటోపములు గాంచివీరు లెల్ల, భయము చెందిరిగుహుఁడంత ◆ పాశుపతము
విమలగర్వాపహరమును ◆ వేగదొడగి, పరపె రణభూమిదానవ ప్రతతిమీఁద.

వ. అది యుదీర్ణమహాస్త్రంబులును సత్ప్రాపితకులిశంబులును సముద్భూతవిషంబును నుదయదసంతరుద్రవినిద్రితంబును నుజృంభిత దివ్యాస్త్రంబును నుచ్ఛావచజలధి కల్లోలజాలంబును నుద్భూత పరిశయానల కీలంబును నగుచునరుదెంచి తదస్త్రంబుల నిమిషమాత్రంబునం దునుమాడి యప్పర్వతంబును జూర్ణంబు చేసి దానవులనెల్ల నొక్కపెట్టన నిర్మూలంబు గావించిమరలి నిలింపసేనాని పాణితలంబునుందె నాసమయంబున. ౧౩౫

—◆ కుమార శూరపద్ముల యంతిమ యుద్ధము. ◆—

క. శూరుం డొక్కఁడనిల్చెను, ఘోరణమండలమునందు ◆ నది గనిదివిజుల్
శౌరికమలాసనులతో, భూరితరంబగు ముదంబు ◆ పొందిరిమదిలోన్ ౧౩౬

వ. అంత శూరుండు కోపాటోపంబునం గనలుచు వికటభృకుటి కుటిలేక్షణుండై యింద్రిలోకరథంబునం గని వీరలను సకలభూతంబులను సేనాపతు

లం గొని చని యండ గోళంబున నిలిపి కాచికొనియుండు మని యానతిచ్చె
న ట్టిదియు నతిజవంబున వారలనందఱ మోహాక్రాంతులం జేసికొని పోయి
యచ్చోట నునిచికొని యుండె నంత. ౨౪౦

ఆ. శూరపద్ముఁ డపుడు • సుప్రీతుఁ డయ్యెను, వేల్పులెల్ల దుఃఖ • వివశులైరి
సదయహృదయుఁ డద్రి • జాతనూభవుఁ డాత్మ, సకలమదియు నెఱిఁగె సత్వరముగ.

వ. అనేకంబులగు మహాస్త్రంబులఁ బరపిన నవియు నతిరయంబునం జని తద్రక్ష
సన్నిహితులగు వారల లేపి యరదంబుతోడన గుహాంతరంబునకుం గొని తె
చ్చె నిమిషమాత్రంబున. ౨౪౨

ఆ. అంత రథము డిగ్గి • మహావీర పుంగవుల్, సైన్యవరులు భూత • సంతతులును
కార్తికేయచరణ • కంజంబులకు మ్రొక్కి, ప్రణుతి జేసి రెలమి • భక్తి దనర.

వ. అయ్యవసరంబునం బరమాత్ముండగు నప్పార్వతేయుం డారథంబునుం గ
ని నీవు దురాత్ముండవు దానవుచెంత కరుగవలదు ఇందే వసింపుమని ప
లికి యయ్యింద్రలోక రథమును స్తంభింపం జేసె నంత. ౨౪౪

క. శూరుండదిగని కనలుచు, నారాచంబులును గురిసె • నగజసుతుపై
ధీరత గుహుండవి యెల్లవి, దారించి శరాళి మఱియుఁ • దద్దయు గురిసెన్.

క. దానవుఁడు గుహుశస్త్రవి, తానము గళితముగఁ జేసి • తత్సారథినిం
దేఁ శితాశుగ వితతులు, నోనాటఁగ నేసె కడున • నూనప్రౌఢిన్. ౨౪౬

వ. తదీయాస్త్రఘాతంబులఁ బవనుఁడు రక్తసిక్తాంగుండగుచు రథచోదనంబు
నందు నశక్తుండై మొల్లంబు దక్కి నల్లంబోయె నయ్యెడ. ౨౪౭

క. కనియదియుఁ గార్తికేయుఁడు, దనుజుని కార్ముకము దునిమె • దారుణశరశ
స్త్రనికాయంబుల నంతట, ననుపమ శౌర్యంబు శూరుఁ • డతికోపమునన్.

ఆ. సింహవాహనంబు • శీఘ్రింబడిగి శూల, మఖిలరిపువిశాల • మలరఁ బూని
ఘోరతరముగాఁగ • గోలాహలము సేసి, కొనుచునరుగుదెంచె • గుహుని మీఁద

వ. అప్పుడు తదీయంబగు సింహవాహనంబు గర్జింపుచు షణ్ముఖ రథాశ్వంబుల
హతంబులు గావించె దానవుండును శూలంబు గుహునిపైం బ్రయోగించి
న నదియు ఘోరానల జ్వాలామాలికలును నతికరాళ హాలాహల జ్వాలంబు
లును నతిభయద భూతజాలంబులును ననేకాయుధ వ్రాతంబులును ననుసృజిం
పుచు మహావేగంబునం జనుదెంచు సమయంబున. ౨౫౦

ఆ. గుహుండు దానిమీఁద ♦ ఘోరసాయకకోటి, గురిసెనరియు గడియ ♦ సర
కుగొనక
వచ్చుచుండ మఱియు ♦ వారక కులిశంబు, పరపె శివసుతుండు ♦ బాహుపటిమ.

వ. అక్కులిశంబు తదీయశూలంబునుం గరశంబగు నిజముఖంబునం గీలించి గుహునిపాణితలంబు సేరెనప్పుడు సుపర్వులు సంతుష్టాంతరంగు లగుచు.

క. శరజన్మకృపాంభోనిధి, దురితాత్మునిదైత్యునితని ♦ దురమాడి రణో
ర్వరమునురక్షించవెన, త్వరముగ ననిపొగడిరీశ ♦ తనయునిభక్తిన్. ౨౧౩

—♦ శూరపద్ముండు విహంగాదిరూపములు ధరించి యాకసమున యుద్ధముసేయుట. ♦—

వ. అయ్యవసరంబున గుహుండు ద్విసహస్రంబులగు ఘోరనారాచంబులు దానవుని వాహనంబుపైఁ బ్రయోగించిన నదియు గతప్రాణంబై నేలంగూలె నసురుండు సంహృతవాహనుండయ్యును బాలివోని ధైర్యంబున జలంబు నూలుకొలుపుచు భూతలంబుననిలిచి యత్యద్భుతంబునునతిఘోరంబును నత్యున్నతంబును నగు రథాంగనామక విహంగరూపంబు గైకొని నభంబున కెగసె. ౨౧౪

క. అతఁడపటుతరపక్షా,ఘాతంబుల సకలభూత ♦ గణముల వీర
వ్రాతములనెల్ల మోహా, న్వితులఁగావించెఁ జటుల ♦ విక్రమమొనరన్.

వ. మఱియు చండప్రహారంబులఁ గొందఱఁ జరణఘాతంబులఁ గొందఱ నిగత జీవులఁ గావింపుచు నుపరితలంబునం భ్రమింపుచు నబ్బాహులేయు సారథి రథరథ్యంబులఁ జంచుఘాతంబులఁ గొట్టి చిదిమి పరిమార్చి వీరాయుధంబులు భంజించి విహరింపుచుండె నప్పుడు. ౨౧౬

క. అది దైత్యుని చేష్టితమని, మది నెఱిఁగి గుహుం డనేక ♦ మార్గణకోటుల్
గదియించి నశూరుఁడుత, త్ప్రదరవాత్రముల నణఁచె ♦ బక్షాహతులన్.

వ. వెండియుఁ దుండంబుల ఖండించియుఁ బాదంబులవిదారించియు మహాజనంబులు సరిత్సాగరశైలంబులును జక్రవాళాచలంబులును భూనభంబులును బాతాళంబులును డాయుచు మెలగుచు నిఖిలభూతగణంబుల నీరులను గబళించి మగుడ విక్షేపణంబుల దిగంతంబులు చలింప నిలింపసేనాసరథోపరిభాగంబున మహారవంబడర బరిభ్రమించె నంతయు. ౨౧౭

క. విహగేంద్రంబును గనుగొని, గుహుఁ డద్భుతమంది యిట్టి ♦ కుటిలాకారముల్
విహితము గాదని యవ్వేడ, మహిపై దెరువడిగి నిలిచె ♦ మానుగ నెదుటన్.
వ. ఇట్లు సవలోకించిన నతండు నయ్యశ్వారు ననుజ్ఞ వడసి యత్యద్భుతంబు
గా మయూర రూపంబు ధరించి నిజస్వామికిం బ్రణమిల్లి వినయంబున ని
ట్లనియె. ౨౬౦
క. వేగమ దేవా మదుపరి, భాగంబున నిలిచి దైత్య ♦ పటిష్ఠుతోడన్
బ్రాగల్భ్యమలరఁ బోరుము, నాగుహుఁ డంగీకరించి ♦ నగుచున్ వేడ్కన్.
వ. అమ్మయూరంబు నధిరోహించి కోపంబు గదుర ననక్రపరాక్రమోద్రేకం
బగు చక్రవాకంబుపై బరపిన. ౨౬౧
మ. పటురోషోద్ధతి చక్రవాక మపుడున్ ♦ బక్షానిలోద్వృత్తి ది
క్తటముల్ గంపము నొంద నిష్ఠుర నఖ ♦ ద్యచ్చంచుఘాతంబులన్
జటులప్రౌఢిమ పాదఘట్టనల భా ♦ స్వల్లీలఁ జక్కాడ ను
ద్భటశక్తిన్ మాని మయూరమున్ వెగచి సం ♦ తాపంబు నొందెన్మదిన్.
వ. అదియుం గని గాంగేయుండు క్రోధాంతరంగుండై యారథాంగంబు శిరో
వక్షోంఘ్రిప్రదేశంబుల బహునిశిత శిలీముఖంబులు బరపినఁ దద్బాణఘా
తంబులఁ బడలి యొడలి రుధిరపూరంబులుం దొరుగఁ బక్షంబులు విదళ్చ
చు నగసి సకలలోకంబులు భయంపడ సంచరించె నంతయు. ౨౬౨
ఉ. తారకవైరి యత్తరిని ♦ దగ్రత నెచ్చటనున్న నచ్చటన్
సారెకుఁ బక్షిపై నిశిత ♦ సాయకముల్ గురిసెన్ యుగాంత వి
స్తారఘనాఘనంబు క్రియఁ ♦ జయ్యన నంత ఖగంబు పెల్లుఘున్
జేరె ధనుర్విభంజనము ♦ సేయఁ గడంగి మహాజవంబునన్, ౨౬౩
వ. ఇట్లు సమీపగతంబైన వానిం గని మహామహుండైన గుహుండు మండలా
గ్రంబున రెండు ఖండంబులు గావించి మహీతలంబునం గడపిన. ౨౬౪
ఆ. మగుడి యద్దురాత్ముఁ ♦ డాగి లేచి బ్రహ్మాండ, భిత్తి నంటఁ బెరిగి ♦ భీషణము గ
నరుణపదము లంటి ♦ సనిలపథంబును, నడ్డగించె రోష ♦ మతిశయిల్ల. ౨౬౫
వ. అప్పుడప్పుండు ంకరాకారంబు గనుంగొని శరజన్ముండు భర్జింపుచు నతనిపై
నిశితశిఖంబు లేడు బరపిన నవియు మహాసముద్రరూపంబులగుచు భూమం
డలంబు నిండి తద్భీషణాకారంబు నణంచె నప్పుడు. ౨౬౬

ఆ. అంత నసురవరుం డలిగి యంబుధిరూపమై, ఘనతరంగములను గవిసి నెగడుచుని
దానిమీఁద నతఁడు దావానలాంబక, శతము బరపెఁ జేల్చె జలధి నదియు,

వ. అప్పు డన్నిశాచరుండు వహ్నిరూపంబై వహ్నిసంభవు నెదిర్చిన నమ్మహానుభావుండు సహస్రవిశిఖంబులుం బ్రయోగించె నవియుం బ్రచండవాయురూపంబులై తద్వహ్ని జల్లార్చె నంత. ౨౭౦

క. తారకదైత్యుఁడు ఘోరస, మీరాకృతిఁ బూసరాగ మీఁదికి గుహుఁడున్
నారాచంబులు లక్షను, దారతఁ ద్రోఁచినను బరపె దక్షిణ పవియున్.

వ. మహాఘోర సర్పరూపంబులై వానిం గ్రసించె నిట్లు తద్బాణంబు లన్నియు దానవు తత్తద్రూపంబు లన్నియు హరించి ఘురలాం గార్త్తికేయునిం జెందె నివ్విధంబున నద్దేవదానవులకు నాల్గుదినంబులు పోరు ఘోరంబుగాఁ జెల్లె నంత శూరుండు మాయారూపంబున. ౨౭౨

సీ. మూర్తిత్రిమూర్తులై వర్తించు నొక్కెడ, నొక్కెడ దనుజుఁడై యుక్కు మీరు
ఇంద్రాదిరూపంబు లింపొందు నొకచోట, నొకచోట భూతమై యుఱుదు మిగుల
పైశాచరూపమై భాసిల్లు నొకచాయ, నొకచాయ ఘోరపాతకుఁడు నగుమ
నంతకాకారుఁడై నలరారు నొకకేళి, నొకకేళి పవనమై యుద్భవిల్లు

తే. జలధిరూపంబు గనుపట్టు నొక్కపట్టు, మేఘరూపంబు నగుచును మెరయు చాల
నొక్కకడ భూధరంబట్లు నొప్పమీరు, శూరుఁ డాహవమున మహాశూరుఁ డగుచు. ౨౭౩

వ. వెండియు దిగంత దంతావళరూపంబును శరభసింహశార్దూలమృగవిహంగ రూపంబులును సింహాస్యతారక భానుకోపాగ్నిముఖాదిరూపంబులును మంత్రిసేనాపతి రూపంబులును ధరించియు నొక్కొక్కచోట నిజరూపంబు దాల్చియు నొకప్రదేశంబున నుండి వేరొక్కదిక్కునం గనుపడుచు నద్దానవుండు మహారావంబుల లోకంబు శోకంబు నొందఁ జేయు నయ్యెడ నఖిల బృందారకులు గాందిశీకులై రెంతయు. ౨౭౪

క. సకలంబనియుఁ గనుంగొని, సకలేశుండైన గుహుఁడు సంస్మృతుఁడై సా
యకములు సహస్రకోటులు, ప్రకటితముగ దైత్యుమీఁదం బరపెఁ గడిమిన్.

వ. తచ్ఛరంబు లన్నియు నద్దురాత్ముని నొక్కొక్క రూపంబునకు సప్తగుణి
తంబులై వేరు వేరం బొరిగొని మగుడి గుహునిం జేర నంత శూరుం డొ
క్కరుం డవశిష్టుండై యద్దేవు చెంత నిలిచె నంతయు. ౩౨౬

—♦ కుమారస్వామి శూరపద్మాసురునికిం దనవిశ్వరూపంబుం జూపుట. ♦—

క. పరమదయాంబుధి గుహుండా, దురితాత్మునిదైత్యుఁజూచి ♦దోషాచర భా
సురకుగనీ రూపంబుల, బరికించితిజూడుమింక ♦ నారూపంబుల్. ౩౨౭

వ. అని పలికి విబుధాగ్రగణ్యుండైన సుబ్రహ్మణ్యుండవాఙ్మానసగోచరంబైనవి
శ్వరూపంబు సూపె నప్పుడు. ౩౨౮

సీ. అంఘ్రితలంబున♦నసనీధరంబులు, పాదోర్ధు లేడును♦బ్రపదములును
జరణాంగుళులనుకుల్♦వరుణదైత్యార్కచంద్రులునునంతర్బహిర్గుల్ఫములును
జంఘలవహనులు ♦ జానులసురమణి, ఇంద్రజయంతులు ♦ నెలమితొడలు
కటిబంధములయందు ♦గాలంబుయముఁడును,గటిసీమవసువులు♦గ్రామదనరం
ఆ, బార్శ్వములనసురలు♦ఫణులుగుహ్యంబున, శేఫనమునసుధయుఁజెలువెసంగ
జగదుసయము నాభి♦ శాస్త్రంబు లురమందు,బ్రహ్మమాధవులును ♦ బా
హువులును. ౩౨౯

వ. మఱియు జ్ఞానంబున యజ్ఞోపవీతంబును గరంబున భోగంబును రోమకూ
పంబుల నజాండంబులు నంగుళుల నప్సరసలు కంఠదేశంబున శబ్దంబులువ
క్త్రంబున దేవతలు దంతంబుల నక్షరంబులుజిహ్వను శివాగమంబులునో
ష్ఠదేశంబునసప్తకోటిమహామంత్రంబులు నాసికనువాయువు నేత్రంబులనిం
దుభాస్కరులును శ్రోత్రంబునదిశలును లలాటంబునం బ్రణవంబును శిరం
బునం బరమాత్మయగు సాక్షాచ్ఛివుండును గలిగి యనేకాదిత్య సంకాశ తే
జోవిరాజమానంబై నేరికిం దేఱజూడ నలవిగాక నత్యద్భుతంబగు విశ్వరూ
పంబు సూపిన. ౩౩౦

క. శరజన్ము విశ్వరూపము, పరికించి సుపర్వులెల్ల♦భయమవశి నొంతే
శిరముల నంజలి పుటములు, విరచింపుచుఁ జేసిరెలమి♦వినుతులుభక్తిన్.

—♦ విశ్వరూప దర్శనంబునఁగలిగిన విజ్ఞానంబుచేత శూరుండుకుమారు నుతించుట. ♦—

వ. అప్పుడు పరమపావనుండును గృపాళుండును నగు షడాననుండు వారలం గ
ని భయంబువలదని యాదరించె నంత శూరపద్ముండు తద్విశ్వరూపంబు

విలోకించి తనభాగ్యవశంబున లబ్ధజ్ఞానుఁడగుచు నాత్మగతంబున. ౩౮౩
క. ఘోరముగ దురమొనర్చియు, దారపౌరిధిమసమస్త దనుజులఁ గూల్చెన్
ధారుణి నీతని మహిమం, బారూఢిగ సంస్తుతింప నాశ్చర్యమగున్.
వ. అదియునుం గాక ఇందిరాలోకరథం బితనికి వశంబయ్యె నామాయ యీత
ని మ్రోల వ్యర్థంబై చనియె మఱియు ననంతకోటి బ్రహ్మాండకృత నివా
సంబును నఖిల సురాసురమానవసహితంబును ననన్యసామాన్యంబునగు
రూపంబు సూపె నింతక మున్న కాడే దూతయు సింహముఖుండును బ
హువిధంబుల నితని మహామహిమంబుం జెప్పిన వినక మూఢబుద్ధిం జేసి
యజ్ఞుండనై యమ్మహామహుని బాలిసుండని తలంచితి నితని పాదరోమం
బుల సకలబ్రహ్మాండంబు గనుపట్టుచున్నయది. ఇతండు పరమాత్మయగు
సాక్షాత్పరశివుండు. సకలచరాచరాత్మకంబైన యితని విశ్వరూపం బాపా
దమస్తకంబును నేత్రోత్సవంబు గానవలోకించితి మఱియు నిమ్మహాత్ముని
ననవధిక సౌందర్యంబు గనుంగొనుటకు బుద్ధిబోడమి యుడుగకున్నయది ప్ర
ాక్కృతంబగు మత్తపఃఫలంబునం జేసి నాయందుఁ గృపాళుండై యిమ్మ
హానుభావుండు యుద్ధంబున కరుదెంచె సర్వాంతర్యామియగు నీశ్వరమా
త్మునకుఁ బ్రదక్షిణనమస్కారస్తోత్రంబు లర్పించుటకు నామనంబు రంజి
లుచున్నయది మఱియు నమేయశ్రేయఃప్రాప్తిసూచకంబులగు మదీయం
బునగు దక్షిణనేత్రభుజంబులు స్ఫురింపుచున్నయవి. శత్రుసహాయార్థంబు
గా నిద్దేవుండరుదెంచి నన్నుం గృతార్థుం జేసె నంతయు. ౩౮౪
క. అరుదెంచె నన్నుఁ దురమున, వారింపఁగ నిమ్మహాత్ముఁ డదిభారమ్మే
ధరణిని లీలామాత్రం, బఱయగ నీదేవవిభున కఖిలాధ్యునకున్.
క. దేవప్రీతతికి బంధము, గావించుట వలనఁ గాదెఁ గలిగెను నాకీ
దేవవరేణ్యుని పదరా, జీవద్వయ దర్శనంబు శ్రీసుంబలరన్. ౩౮౬
ఆ. కొంద ఱజ్ఞులగుచుఁ గూడదనిరి మున్ను, దివిజబంధనంబు దీనఁ గాదె
యిప్పు డితనితోడ నేనుయుద్ధముచేసి, పొందఁగంటి జగతిఁ భూరికీర్తి. ౩౮౭
— కుమారస్వామిచేతపద్మాసురు విజ్ఞానుండగుచు శూరపద్ముండా కుమారసంహారమునకై దలంచుట. —
వ. అనియివ్విధంబున దానవేంద్రుండు వితర్కింపుచుండె నాసమయంబున సు
బ్రహ్మణ్యుండు వాని జ్ఞానంబు తోడఁ గూడ విశ్వరూపంబు సంహరించి

ప్రాచీనంబగు నిజరూపంబు గ్రహించె నప్పుడు. ౨౯౦

క. జ్ఞానవిహీనుండగుచుఁ, దానవుఁ డతికోపమడర • దారుణగతినెం
తేని హసింపుచుఁ గరములు, మానుగఁ దట్టుచును శౌర్య • మహిమ చెలంగన్.

వ. నాతోఁ గయ్యంబునకుఁ దొడంగ నెవ్వండును సమర్థుండు గానని పౌరుషంబు లుఁ బలుకుచు ననన్యాదృశంబగు మాయారూపంబు గ్రహించి నిమిషమాత్రం బులోనఁ బేరికులగు సురవర్వులం గబళించి బాలకు వధించెదనని మనం బునం దలంచి దురాత్ముండగు నయ్యసురుండు విధిచోదితుండై. ౨౯౧

మ. జగమెల్లన్ దిమిరంబు నిండఁ గనమ • గ్నస్ఫూర్తి నత్యద్భుతం
బుగ నేకాంఘ్రు లనేక పాణివదనం • బుల్ భాసిలన్ మాయికం
బగు రూపంబు ధరించి యంబరము నందా • దైత్య వర్యుండు దే
వగణంబుల్ వెస మ్రింగ హస్తములు శక్వత్ప్రీతి సాచ్చెన్ గడున్.

వ. ఆసమయంబున సకలదేవతలు భీతచేతస్కులై భక్తశరణ్యుండగుసుబ్రహ్మ ణ్యుని శరణుబొందుచు దేవా! దయాసముద్రుండవు భక్తభయహరుండవు నీవు దనుజభయాకులచిత్తులమగు మమ్మురక్షించి మహాఘోరుండగు నిద్దు రాత్ముఁ దెగటార్పుమని ప్రలాపించుచు నెల్లడం బరచిరి మాయారాకృతి యగు నిం మ్రింకును శౌర్యధైర్యభాసియుండగు నబ్బాహులేయునల్లనం బ్బాధించె నయ్యవసరంబున. ౨౯౩

—• కుమారశక్తిచే శూరసన్ముడు నేఁగూలుట. •—

క. సురగణముల వచనంబులు, శరజన్ముం డాలకించి • సంపూర్ణకృపా
భరితాత్ముండగుచు శాత్రవ, హరణోగ్రం బైన శక్తి • నాతనిపై నుండున్.

వ. అద్దానవుని రూపుతుత్పనియఁగావించి రమ్మని పనిపిన నదియు నాదిత్యకో టిసమప్రభాభాసమానంబై యగ్నికణంబులు గురియుచు మాయారూ పంబగు తిమిరం బణంచి శూరపద్ముపై మందమందగతి నేతెంచు నప్పు డతండు. ౨౯౪

తే. నాశరహితుండనైనట్టి • నన్ను శక్తి, యేమిసేయంగఁగలదని • యే పెసంగ
నట్టహాసంబొనర్చుచు • సలగిమిసుల,నుగుండగుచుదురాగ్రహ మొదవనట్టు

వ. సకలలోకంబులు సంహరించి నిమిషమాత్రంబున నర్భకుం దెగటార్చెదన నై తలంచి సత్వరంబుగాఁ జని సముద్ర మధ్యంబు నొంచె. ౨౯౫

బహుళధూమచ్ఛటా • భాసురంబు
సీ. చటులానలజ్వాల • జాలప్రవాళంబు, శ్యామరక్తశిలాటు • సంయుతంబు
కమనీయకాంచన • ఘనపుష్పకలితంబు, మేఘశాఖావళీ • మేదురంబు
పద్మరాగోపల • భవ్యఫలౌఘంబు, మురుతరచ్ఛాయమ • భ్యున్నతంబు
పద్మజాండకదాహ • పర్యంతగతమూల, మగుచు దిక్పాలపురముల • నాక్రమించి
తే. లక్షయోజనదూరసం • లక్ష్యమాన, చూతభూజాకృతిధరించె సురవిరోధి.
బ్రహ్మవిష్ణ్వాదిలోకముల్ • భయపడంగ,

వ. అప్పుడు తదీయస్కంధంబుల ఘర్షితంబులగుచు మాతృకన్యాలోకంబులు
భయాకులంబయ్యె సకల జగంబులు గంపించె భూతలం బదరె నభోభువన
జాలంబులు వణంకె ఆదికూర్మ వరాహానంత దంతావళంబులు సంత్రాసం
బు నొందె తారకలెల్ల నెల్లెడలం దుల్లె చంద్రసూర్యాది నవగ్రహంబులు
గతులు దప్పె నప్పుడు.

ఆ. కాందిశీకులగుచుఁ • గొందఱు దివిజులు, మేరుభూధరంబు • సేరిరెలమి
గొంద ఱమరవరులు • గొబ్బున కైలాస, పర్వతంబునకును • బరువులిడిరి.

వ. ఇట్లద్దురాత్ముని మాయ గని గుహప్రేరితంబైన యాశక్తి కోపంబునఁ బ్ర
ళయకాలాగ్నిసదృశయు మహారావ భీషణయు నగుచు సముద్రంబులు ఘూ
ర్ణిల్ల జనుదెంచి చూతాగ్రంబు రెండు వ్రయ్యలుం జేసిన. 300

ఆ. అంత దానవేంద్రుఁ డాభూరుహాకృతి, దొలఁగి స్వస్వరూప • ములను దాల్చి
కడిమిమెఱయఁ గేలఁ • గరవాలము ధరించి, యసురుఁ డేర మ్రోలనతని గదిసి.

వ. ఆక్షణం బాశక్తి తద్వక్షంబు నవిదారించి నిజప్రభాజాలంబుల జగంబులు
వెలుఁగం జేయుచు మరలి సురగణంబులు నుతింప గంగాతరంగిణి యందుఁ
గృతావగాహయై కృతార్థయగుచు దేవదేవుండగు గాంగేయుని పాణితలం
బున నిలిచె నంతయు. 301

— భూమిం బడిన శూరుని కళేబర ఖండద్వయము బర్హికుక్కుట రూపంబులనొంది
కుమారస్వామిని శరణు వేడుట. —

ఆ. అంత రెండుముక్కలై • లఁగుచు దానవుండు పృథ్విఁ, బడిన నందు నొకటి • బర్హియగుచు
మఱియుఁ దామ్రచూడ • మగుచు వేరొక్కటి, వెడలి గుహునికడకు • వేగవచ్చె.

వ. అప్పుడవియు లబ్ధజ్ఞానోదయంబులై పరమభక్తిని గార్తికేయునకుం బ్రణ
మిల్లి సంస్తవంబు లొనరించిన సంతసిల్లి సుబ్రహ్మణ్యుం డింద్రాగ్నిరూపం

బుల బర్హివాహన కుక్కుట కేతనంబుల వీడ్కొని యమ్మయూర వాహ
సం బధిరోహించి యత్తామ్రచూడంబును నిజరథధ్వజంబున నుండ నియో
గించిన నదియు నట్లన నిలిచెఁ బ్రళయాంబుదంబు భంగి మహాభయంకరం
బుగా నినదం బొనరింపుచు. ౩౦౪

మ. గుహునిం బైనిడి భూనభంబులు డుళల్ ◆ గోత్రింబు లంభోనిధుల్
మహితప్రోక్షిమఁ జుట్టి సత్వరగతిన్ ◆ బక్షంబులల్లార్పుచున్
విహరించెన్ గడునాశిఖావళము త ◆ ద్వేగంబునన్ మేరువుల్
మహివ్రాలెన్ జలధుల్ గలంగె ధరకం◆పం బొందె నెంతేనియున్.

వ. మఱియు దిగంతంబులు నిండ ఘీంకారంబు లొనర్చుచు శేష రాహు కేతుప్రముఖ
భోరగంబులకు భయంబు పాదింపుచున్న నమ్మయూరంబును మేఘవాహనంబగు
హరి పరమేశ్వరు నట్లు దేవసేనావల్లభుండగు సుబ్రహ్మణ్యుండు వహించె.

క. సకల దిగంతములందును, ప్రకటిత జవ మొప్పఁ ద్రిప్పి ◆ బర్హిరథంబున్
సకలేశుఁడు గుహుఁడు జవో, త్సుకతన్ రణభూమిఁ జేరె ◆ సురుచిరలీలన్.

వ. అప్పుడా సమరభూమిని వహించిన వాస వాగ్నుల గుహానుజ్ఞం గుక్కుట
బర్హిరూపంబులు విడిచి నిజరూపంబుల శరవణోద్భవునకు భక్తి పూర్వకం
బుగాఁ బ్రణమిల్లి సంస్తుతించిరి. భూతంబులు వీరులు సేనాధి పతులు బ్ర
హ్మ విష్ణుప్రముఖ నిఖిల దేవతలును సంతుష్ట హృదయులై దేవదేవునిం బ
రివేష్టించి కోలాహలంబులం జెలంగి రెంతయు. ౩౦౫

క. కరుణాపూరిత దృష్టిన్, హరసూనుఁడు వారినెల్ల ◆ నవలోకించెన్
శరవణ సంభవు నాశ్రిత, భరణంబును బొగడదరమె ◆ ఫణిపతికైనన్. ౩౦౬

— ◆ శూరుని భార్యలు ప్రాయోపవేశము నొందుట. ◆ —

తే. అంత శూరుండు హతుఁడౌట యాలకించి, పద్మకోమల మొగలైన ◆ పత్నులెల్ల
పతివియోగంబుచే దుఃఖ ◆ భరము నొంది, పావకజ్వాలలందున ◆ బడిరి వేగ.

— ◆ తండ్రి మరణంబువిని హిరణ్యుడు దుఃఖించుట. ◆ —

వ. శూరపద్మతనయుండు హిరణ్యుండు జనకు మరణంబువిని శోకాక్రాంతుఁడై.

క. హా తాత! చనితె కడు విన, వైతివి నాపలుకొకింత ◆ హతుఁడవునై ద్వి
ట్కేతనమునఁ గుక్కుటమై, యీ తెఱఁగున నుండవలసె ◆ నే నీ విధముల్

వ. మఱియు మయూరంబవై శత్రునివహించిచె తేయక్కటా యని వగచి యతం
డంత సైనికులుం గసన బాధింతురని మనంబునఁ జింతించి నిజసురుండగు

శుకునినికటంబు జేరి తదనంతరకృత్యంబు నిర్వర్తించి యైశ్వర్యంబు క్షణభంగు
రమని నిందించి మోక్షార్థి యగుచుం బరమేశ్వరు గూర్చి తపంబు సేయు చుం
డె నీకథాశ్రవణంబు సేయువారలకు సుబ్రహ్మణ్య కృపాబలంబున శత్రు
భయంబు దొలంగు ఋషిముఖంబున నేతదాఖ్యానంబు విని విష్ణువు ము
రాసుర కాలనేము లంజయించె. ఉపమన్యువలనం గృష్ణుండు విని భౌమాదిద
నుజుల నాజిం గెలిచె. పితామహుం డగు శుక్రుని వలన విని మునిశ్రేష్ఠుం
డగు దధీచి శత్రుండగు క్షువుని జయించె నని సూతుండు శౌనకాది మహా
మునులకుం జెప్పె నంతయు. ౩౧౩

ఆశ్వాసాంతము.

శా. ప్రాలేయాద్రిసుతాపయోధరతటీ ♦ బాఢోపగూఢక్రియా
లోలాభీకనికామ భాసుర కృపా ♦ లోకైక సంతర్పితా
త్రైలోక్యాఖిల భక్తలోక నిబ ♦ లోద్యద్విపన్నికీలాచ్ఛటా
తూలాపీన పతాకజంతు పటలీ ♦ దుఃఖాబ్ధి సంతారకా. ౩౧౪

క. వ్యాళాభరణ! కరాళ, క్ష్వేళాభ్యవహార నిపుణ! ♦ శీతాంశుకలా!
శాలీసమేత! నిరుపమ, శైలీధృతహారిణ! విబుధ ♦ కీర్తిత చరణా! ౩౧౫

ఖడ్గబంధం.

హారహీర తారకాంబు ♦ జరిహరి భూరి భూ
భారతీప కేంద్రిశేశ ♦ భావితాంఘ్రి సారసా
సారమేరుశైలచాప ♦ సర్వలోకవల్లభా
భారతీ ప్రవీణ భృంగి ♦ భవ్యనాట్యలోలుపా! ౩౧౬

గద్య.

ఇది శ్రీమత్సకల సుకవి జనానుగ్రహ పాత్ర కాశ్యపస గోత్ర
కోడూరి యల్లనార్య పౌత్ర శంకరామాత్య పుత్ర లక్ష్మాంబా
తనయ వినయవిధేయ బాల సరస్వతీ నామాంక వేంక
టాచల కవి ప్రణీతంబైన శ్రీస్కాందంబను మహా
పురాణంబున శంకరసంహితను శివరహస్య
ఖండంబు నందు యుద్ధ కాండంబున
చతుర్థాశ్వాసము
సర్వము సంపూర్ణము.



ఏవం గ్రంథః ముదిగొండ రామలింగ శర్మణా తాళపత్ర సంపుటాత్ లిఖితస్సన్ పరమేశ్వర
కృపయా అక్షయ నామసం॥ ఆశ్వీజ బహుళ పంచమ్యాం భానువాసరే సమాప్తి మగమత్.

రాఁబోవు గ్రంథ రత్నములు.

## దేవకాండము. - దక్షకాండము.

ఇవి స్కాంద మహా పురాణాంతర్గత శంకర సంహితలోని శివరహస్య ఖండంబున గల అయిదారు కాండములు. బాలసరస్వతీ బిరుదాంకితులైన కొమారి వేంకటాచల కవి ప్రణీతములే. కవిత్వము రసవంతము. క్రమముగా బ... స్య కావ్యమగు శివరహస్య ఖండమంతయు ముద్రించబడును. వలయువారు శైవప్రచారిణీ గ్రంథమాలకు చందాదారులుగా చేరుటలాభకరము.

సంపాదకులు.



శైవప్రచారిణీ గ్రంథమాల యందు ముందు ప్రకటింపఁబడు

## గ్రంథ రత్నములు

1 శివాద్వైత కల్పలతిక ... శాంభవారాధ్యులు.
2 సిద్ధాంతోత్తర కౌముది... ముదిగొండ వీరభద్రారాధ్యులు.
3 శివజ్ఞాన శేఖరము 3-4 సంపుటములు ... ఘంటనామాత్యుఁడు.
4 మల్లికార్జున పండితారాధ్య చరిత్ర ... సంస్కృతము.
5 నందికేశ్వర పురాణము. ,,
6 శైవసిద్ధాంతదర్శిని ౧వ సంపుటము ౨వ సంపుటము. ౩వ సంపుటము
7 బసవపురాణము సంస్కృతము.
8 శివాధిక్య శిఖామణి ... రేణుకారాధ్యులు.
9 శ్వేతాశ్వతర కల్పసూత్రము ... శ్వేతాశ్వతరుఁడు.
10 కృష్ణకృత మహిమ్నస్తోత్రము సవ్యాఖ్యానము మ॥ వీరన్నారాధ్యులు.
11 శివరహస్య ఖండము సంస్కృతము అసుర కాండ, వీరమహేంద్ర కాండ, యుద్ధ కాండ, దేవ కాండ, దక్ష కాండ, ఉపదేశ కాండలు,
12 శైవరత్నాకరము. ... జ్యోతిర్నాథుఁడు.
13 శైవసంజీవిని. ... సిద్ధయోగి.
14 శైవపంచకము. ...



# వరంగల్ - శైవ ప్రచారిణీ కార్యాలయమున

## వెలకు దొరకు గ్రంథములు.

| | | |
|---|---|---|
| 1 | కాశీసారము. ... | 0-[illegible]-0 |
| 2 | భద్రీయ రుపాఖ్యానము. ... | 0-12-0 |
| 3 | విద్యాస్థానవినిర్ణయము. ... | 0-12-0 |
| 4 | శైవసిద్ధాంత దర్శిని. ... | 1-8-0 |
| 5 | ఉపదేశ కాండము. ... | 3-[illegible]-0 |
| 6 | సరస హృదయానురంజనము. ... | 2-0-0 |
| 7 | స్కాంధమహా పురాణము సంభవ కాండము సంస్కృతము తాత్పర్యముతో సహా ... | 3-8-0 |
| 8 | సంభవ కాండము వచనము. ... | 1-4-0 |
| 9 | సోమవార వ్రతకల్పము. ... | 1-8-0 |
| 10 | సత్వమధురము. ... | 1-[illegible]-0 |
| 11 | వీరభద్రాష్టోత్తర శతనామావళి. ... | 0-4-0 |
| 12 | వీరభద్రస్తోత్రకదంబము. ... | 0-12-0 |
| 13 | భక్తపాల శతకము. ... | 0-2-0 |
| 14 | శరభాంకలింగశతకము. ... | 0-4-0 |
| 15 | గీతగౌరీశ కావ్యము. ... | 0-8-0 |
| 16 | అగ్నిముఖము జయాదులు. ... | 0-4-0 |
| 17 | విఘ్నేశ్వరపూజ - పుణ్యాహవాచనము... | 0-2-0 |
| 18 | శివయోగసారము 1 వ భాగము. ... | 1-4-0 |
| 19 | " 2 వ భాగము. ... | 1-4-0 |
| 20 | " 3 వ భాగము. ... | 1-4-0 |
| 21 | " 4 వ భాగము. ... | 1-4-0 |
| 22 | ఆహ్నికకాండ నాలుగు భాగములు. ... | 5-0-0 |
| 23 | శివజ్ఞాన శేఖరము ప్రథమ భాగము. ... | 1-4-0 |
| 24 | శివజ్ఞాన శేఖరము ద్వితీయ భాగము. ... | 1-4-0 |
| 25 | ప్రతాపరుద్ర చరిత్రము. ... | 0-12-0 |
| 26 | లింగధారణదీపిక. ... | 1-0-0 |
| 27 | బసవవిజయము. ... | 0-12-0 |
| 28 | యుద్ధకాండము. పద్యకావ్యము. ... | 2-8-0 |